*Issued—November* 1955.




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

## DEBATES

## SATURDAY, THE 25th APRIL 1955

## VOLUME I—No. 3

*CONTENTS*



THE ROYAL PRINTING WORKS,
MADRAS-2.

FOR THE SUPERINTENDENT, ANDHRA GOVERNMENT PRESS,
KURNOOL.
1955

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

MONDAY, the 25th APRIL 1955

The House met in the Legislative Assembly Hall, Kurnool, at eleven of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. OATH OR AFFIRMATION BY MEMBERS

The following Member took the prescribed oath:-
Sri K. Obul Reddi.

## II. PANEL OF CHAIRMEN

MR. SPEAKER: I am to announce that the following hon. Members will constitute the Panel of Chairmen for this session of the Assembly:

Sri M. R. Apparao

Sri G. Jagannadharaju

Sri S. Vemayya

Sri P. Narasimhappa Rao

I have to acquaint the House that on 23rd April 1955 the Governor was pleased to make a speech* to the Members of this House, of which I had for greater accuracy obtained a copy and placed it on the table of the House on the 23rd April itself.

## III. DISCUSSION ON THE GOVERNOR'S ADDRESS—MOTION OF THANKS

MR. SPEAKER: Before I call upon Mr. Rajeswara Rao to move his motion, I want to inform the House that I wish to follow the

*Printed as appendix to the Andhra Legislative Assembly proceedings dated 23-4-55.

following procedure. Let Mr. Rajeswara Rao formally move his motion, and after that, let each member who has given notice of amendment move formally his amendment, let it be duly seconded, and then discussion will follow on the main motion and the amendments.

SRI M. RAJESWARA RAO: Mr. Speaker, Sir, under Rule 5(1) of the Madras Assembly Rules, I beg to move the motion which stands in my name, which is as follows -

> "That the members of the Andhra Legislative Assembly assembled in this session are deeply grateful to the Governor for the address which he has been pleased to deliver to this House on the 23rd April 1955."

The motion was duly seconded.

MR. SPEAKER: Now let each Member who has given notice of amendment formally move it and let it be seconded.

Sri P. Sundarayya :—ఈ దిగువ సవరణలను నేను ప్రతిపాదించుచున్నాను.

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని అన్ని రకాల బంజరు భూములను వ్యవసాయ కూలీలకు తదితర బీద ప్రజలకు ఉచితముగా పంచిపెట్టవలెననెడి అసెంబ్లీ ఏకగ్రీవ తీర్మానానికి భిన్నంగా ప్రభుత్వము ఆ భూములను వేలమువేసి అమ్మడానికి నిశ్చయించుకొన్నందులకు ఈ సభ విచారము తెలియజేస్తూయున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని పది రూపాయలలోపు భూమి శిస్తు చెల్లిస్తూయున్న రైతు కుటుంబాలనుండి ఇక ముందు శిస్తు వసూలు చేయమని ప్రభుత్వము తాము ఇదివరకు చేసిన ప్రకటనను బుట్టదాఖలు చేసి, పన్నులు యథాతథంగా వసూలుచేయ నిర్ణయించుకున్నందులకు ఈ సభ విచారము తెలియజేస్తూయున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని ప్రభుత్వము అదనపు [illegible], అభివృద్ధి పన్నును వేయుటానికి, బీద, మధ్య తరగతి రైతుకుటుంబాల మీద కూడ మినహాయింపు లేకుండా ఈ పన్నును వేయడానికి నిశ్చయించుకొన్నందులకు ఈ సభ విచారము తెలియజేస్తూయున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని రైతులు పండించే పంటల ధరలు, ముఖ్యంగా వ్యాపార పంటల ధరలు విపరీతంగా పడిపోతూ ఉన్నందున రైతాంగం ఎదుర్కొంటున్న ప్రమాదమునుండి వారిని రక్షించడానికి, రైతుకు గిట్టుబాటయ్యే ధరను గ్యారంటీ చేయడానికి ప్రభుత్వము ఇదివరకే ఏమి చర్యలు తీసుకున్నది, ఏమి చర్యలు తీసుకోదలచినది వివరించనందులకు ఈ సభ విచారము తెలియజేస్తూ యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని ప్రభుత్వము ప్రజల జీవితస్థాయిని పెంపొందించలేకపోవడమే గాక తన క్రిందనున్న చిన్న ఉద్యోగస్థులకు ఇస్తూవచ్చిన ఇంటి అలవెన్సు ఆపివేయడము, అధికధరల అలవన్సు తగ్గించడానికి ఆలోచిస్తూ ఉండడము, మరోవైపు పెద్దఉద్యోగస్థుల జీతాలను తగ్గించడానికిగాని, ఒక కుటుంబముయొక్క గరిష్ట ఆదాయ పరిమితిని లేదా గరిష్ఠ భూపరిమితిని నిర్ణయించడానికి గాని ఎట్టి చర్యలు తీసుకొనకపోవడము చేత ఈ సభ విచారము తెలియజేస్తూ యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"వివిధ పరిశ్రమలలో పనిచేస్తున్న కార్మికులకు కనీసవేతనాలు ఇంకా నిర్ణయించక పోవడమే గాక, నిర్ణయించిన వేతనాలు కూడ ఖచ్చితంగా అమలు జరిపించడానికి తగిన ఏర్పాట్లు చేయకపోవడంచేతనూ, వ్యవసాయ కూలీలకు అసలు కనీస వేతనాలే నిర్ణయించడము ఇంత వరకూ జరగకపోవడముచేతనూ ఈ సభ విచారము తెలియజేస్తూ యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"చేనేత పారిశ్రామికులు, గీతపారిశ్రామికులు, ఇతర చేతివృత్తిదారుల పరిస్థితి బాగుచేయలేక కాలయాపనజేస్తూ ఉండడంచేత ఈ సభ విచారము తెలియజేస్తూయున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని ఆంధ్రుల జాతీయ వాంఛ అయిన విశాలాంధ్ర నిర్మాణానికి ప్రభుత్వము ఏమి చర్యలు ఇంతవరకు తీసుకున్నది, ఇకముందు తీసుకో దలచినది వివరించనందులకు ఈ సభ విచారాన్ని తెలియజేస్తూ ఉంది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని, నేటికి పోలీసు దళాల, ఉద్యోగస్థుల మనోప్రవృత్తిని, ప్రవర్తనను ప్రభుత్వము మార్చలేనందులకు; నేటికీ ఉత్సవ సందర్భాలలోను గౌరవ కార్యకలాపాలలో సైతము, స్వాతంత్ర్య పూర్వ దినాలలో వలె పోలీసు పటాలాల ప్రదర్శనము జరిపి ప్రజలకు అనేక ఇబ్బందులు కలుగ జేస్తున్నందులకు ఈ సభ విచారాన్ని తెలియజేస్తూ ఉంది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"రూటు బస్సులు, లారీలు ఉపయోగించి ఓటర్లను చేరవేస్తు వుండడము, నేటికి తాము చెప్పిన అభ్యర్థులకు ఓటు చేయలేదని అనేక గ్రామాలలో ఓటర్లమీద భూస్వాములు, పెత్తందారులు అనేక దౌర్జన్యాలు సాగిస్తు ఉన్నవారిని ఆపుజేయలేక పోయినందులకు, ఈ సభ విచారము తెలియజేస్తూ ఉంది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని రెండవ పంచవర్ష ప్రణాళికలో చేర్చడానికి పంపిన స్కీములు చాల అసంతృప్తికరంగా వుండుటచేతను ఈ సభ విచారము తెలియజేస్తూ ఉన్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని రెండవ పంచవర్ష ప్రణాళికలో పెద్ద పరిశ్రమలను ఏర్పాటు చేయడానికి, ముఖ్యంగా విద్యుచ్ఛక్తిని, బొగ్గును, మైకా, మాంగనీసు, వివిధ రంగుల పరిశ్రమలను; వస్త్రాలు, సోపు, చెప్పులు, సిగరెట్లు, వీనికి కావలసిన ముడి సరకులున్ననూ, అభివృద్ధిచేయుటకు తగిన స్కీములు సూచించక పోవుటచేతను ఈ సభ విచారము తెలియజేస్తూ యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని రెండవ పంచవర్ష ప్రణాళికలో రైలు, తదితర రవాణా సౌకర్యాలు విరివిగా అభివృద్ధి చేయడానికి స్కీములు సూచించకపోవుటచేతను ఈ సభ విచారము తెలియచేస్తూ ఉన్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని రెండవ పంచవర్ష ప్రణాళికలో ముఖ్యంగా నీటి కొరత ప్రాంతాలకు కావలసిన నీటి వనరులకు ప్రత్యేకించిన డబ్బు చాల కొద్దిగావున్నందుకు, ముంపు నివారణ స్కీములను అసలు సూచించనందుకు ఈ సభ విచారము తెలియజేస్తూ ఉన్నది."

The amendments were duly seconded.

Sri Pillalamarri Venkateswarlu :—నేను ఈ దిగువ సవరణలను ప్రతిపాదించుచున్నాను.

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని మద్రాసులోనున్న ఆంధ్ర ప్రభుత్వపు ఆఫీసులను మన రాష్ట్రములోనికి తరలించు విషయము పేర్కొననందుకు ఈ సభ విచారమును తెలియజేస్తూన్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని రాష్ట్రవ్యవహారములలో ప్రభుత్వ కార్యకలాపాల నిర్వహణ, గెజెట్, రిపోర్టు మొదలగు ప్రచురణములు తెలుగు భాషలో జరుగునట్లు సూచనలు చేయనందుకు ఈ సభ విచారము తెలియజేస్తూ యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని మన రాష్ట్రములో వ్యవసాయక పారిశ్రామిక అవసరాలకై వుపయోగించు విద్యుచ్ఛక్తిపై రేట్లు పెంచుటవలన కలిగిన యిబ్బందులను తొలగించుటకు సదరు రేట్లను తగ్గించు సూచవలను పేర్కొననందుకు ఈ సభ విచారము తెలియజేస్తూ యున్నది."

Sri S. Vemayya :—నేను పై సవరణలను బలపరచుచున్నాను.

Sri K. V. S. Padmanabharaju·—నాపేరన ఉన్న సవరణలను నేను ప్రతిపాదించుచున్నాను.

Add the following at the end:

"but regret to note —

the failure of the Government to indicate what they propose to do in regard to the steep fall of agricultural prices and the consequent hardships caused to the agriculturists."

Add the following at the end:

"but regret to note—

the failure of the Government to indicate the urgency of land reforms:

(a) by fixing a definite date for the abolition of inams;

(b) by allowing concentration of land holdings in Nandikonda Project area and sale of waste lands thus negativing the proposal for the restriction of land holdings;

(c) to implement the decision of the previous Assembly to distribute the banjar lands throughout Andhra."

Add the following at the end:

"but regret to note—

the failure of the Government to implement the decisions of the previous Government regarding exemption of uneconomic land holdings from land revenue."

The amendments were duly seconded.

[25th April, 1955

Sri R. B. Ramakrishna Raju:—నాపేరున ఉన్న సవరణలను నేను ప్రతిపాదించుచున్నాను.

Add the following at the end .

"but resolves —

to suggest that the phrase "My Government" wherever it occurs in the present address and in future addresses be replaced by the phrase "Our Government."

Add the following at the end:

"but resolves—

to convey to the Governor the deep sense of disappointment caused to the poor ryots by the decision of the Government not to give effect to exemption to persons paying land revenue of Rs. 10/- and less."

Add the following at the end:

"but resolves—

to express its regret that while the House appreciates the Government's efforts to construct big irrigation Project no proposals are indicated for taking up small scale net irrigation works in needy areas in the State calculated to provide adequate irrigational facilities on a wide scale in the State especially in the uplands."

Add the following at the end:

"but resolves—

to express its regret that no special consideration is indicated under planning to Zamindari areas newly taken over by the Government, which are proverbially backward and have been neglected for centuries."

Add the following at the end:

"but resolves—

to express its regret that while provision is made for proper water supply to Municipalities the address is silent about a similar provision for villages and Panchayats."

25th April, 1955] (Sri R. B. Ramakrishna Raju)

Add the following at the end:

"but resolves—

to state that the address should have given an indication of the provision made or to be made for the health welfare and protection of the agriculture of tribal people."

The amendments were duly seconded.

Sri Gottumukkala Jagannadha Raju:—ఈ దిగువ సవరణను నేను ప్రతిపాదించుచున్నాను.

Add the following at the end :

"but regret to note that no date has been fixcd.

before which District Board elections would take place and to note that alternative agencies are still being contemplated."

The amendment was duly seconded.

Sri Vavilala Gopalakrishnaiah:—ఈ దిగువ సవరణలను నేను ప్రతిపాదించుచున్నాను.

Add the following at the end·

"but regret to note the failure of the Government to mention about the declaration of moratorium."

Add the following at the end:

"but regret to note the failure of the Goverenment to mention about the implementation of land reforms."

Add the following at the end:

"but regret to note the failure of the Government about the cancellation of heavy penalties levied on Sivaijama lands and distribution of banjar lands to the poor as resolved by the last Assembly."

Add the following at the end:

"but regret to note the failure of the Government to mention about the implementation of Kuppuswami Committee recommendations."

(Sri Vavilala Gopalakrishnaiah) [25th April, 1955

Add the following at the end:

" but regret to note the failure of the Government to mention about the immediate relief for widespread unemployment."

Add the following at the end:

" but regret to note the failure of the Government to mention about the fixation of minimum prices for oil seeds and other agricultural produce. "

Add the following at the end:

" but regret to note the failure of the Government to mention about the starting a Cement Factory at Macherla by Government itself. "

Add the following at the end:

" But regret to note the failure of the Government to mention about the shifting of the offices from Madras to Andhra. "

Add the following at the end:

" but regret to note the failure of the Government to mention about the publication of the Reports of the Committees on Ayurveda and Homeopathi systems. "

Add the following at the end:

" but regret to note the failure of the Government to mention about the publication of the Report of the Committee on the Hindu Religious Endowments Act. "

Add the following at the end:

" but regret to note the failure of the Government to mention about the publication of the Report of the Committee on Telugu Shorthand and Typewriting. "

Add the following at the end:

" but regret to note the failure of the Government to mention about expediting the inclusion of houses in Gramakanthams and allotting the house-sites to poor by acquisition as resolved by the last Assembly. "

25th April, 1955] (Sri Vavilala Gopalakrishnaiah)

Add the following at the end:

" but regret to note the failure of the Government to mention for the opening of an Archaeological Museum in Andhra."

Add the following at the end:

" but regret to note for the cancellation of the exemption of land revenue below Rs. 10."

Add the following at the end:

" but regret to note for the trying for an alternative instead of conducting elections to the District Boards."

Add the following at the end:

" but regret to note for the enhancement of the rates of consumption and installation charges of electricity."

Add the following at the end:

" but regret to note for not extending the Minimum Wages Act for agricultural labour and some provisions of the Employees' State Insurance Act, 1949 to the whole of the State."

The amendments were duly seconded.

Sri S. Ranganatha Mudaliar:—Sir, I beg to move the following amendment:

Add the following at the end:

" but regret to find that no indication is given in the address for the protection of the interests of the minority Tamil community particularly in the Chittoor District in the matter of language, education, culture and trade."

The amendment was duly seconded.

Sri G. Jagannatha Raju:—నేను ఈ దిగువ సవరణ ప్రతిపాదిస్తున్నాను.

Add the following at the end:

" but regret to note that there is no mention of steps that are being taken to prevent sea-sand drifting rapidly, into the Harijan colony and other portions of Bhimunipatnam and to remove existing sand dunes covering some portions in that colony and near abouts."

The amendment was duly seconded.

[25th April, 1955

Sri S. Vemayya:—ఈ దిగువ సవరణలను నేను ప్రతిపాదించుచున్నాను.

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి

"కాని చిన్న ఉద్యోగస్థుల జీతాలు హెచ్చుచేయు విషయము, వారి యిండ్ల వసతులగూర్చి వారి సెలవులు కూడబెట్టుకొనుట, 8 నెలల కాలపరిమితి చేయడము, రహస్యవ్యక్తిగత రికార్డు వుంచుట గూర్చి చెప్పనందుకు విచారించుచున్నాము."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని అనారోగ్య నివారణోపాయకరములైన మురికి కూపములగూర్చి, మంచినీళ్ల వసతులగూర్చి, ఆసుపత్రుల వసతులగూర్చి, అంటువ్యాధులైన క్షయ, కుష్టు, కలరా మసూచి, మలేరియా, టైఫాయిడ్, నెమోనియా అరికట్టు విధానము తెల్పనందున ఈ సభ విచారము తెలియజేస్తూ యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని హరిజన, గిరిజన, వెనుకబడిన జాతుల అభివృద్ధికొరకు నిజమైన పథకాలు, తెల్పనందుకు, అంటరాని తనమును పూర్తిగా బాపుట, వారికి న్యాయవాది సహాయముగూర్చి, వారిని శివాయి జమలు, మక్తాభూములనుండి తరుముటగూర్చి తెల్పనందుకు ఈ సభ విచారము తెలియజేస్తుయున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని, ప్రభుత్వ కార్యకలాపాలు త్వరగా జరుగుటకు ఏపాటి పద్ధతి కనిపెట్టుటగూర్చి చెప్పనందుకు ఈ సభ విచారము తెలియజేస్తుయున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"పరపతి సంఘముల శాఖ, ఇతర శాఖలతో అన్యోన్య సహకారముల పథకాలు లేనందున ఈ సభ విచారము తెలియజేస్తుయున్నది."

The amendments were duly seconded.

Sri D. V. Subba Rao:—ఈ దిగువ సవరణలను నేను ప్రతిపాదిస్తున్నాను.

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని ప్రభుత్వమువారు కౌలుదార్ల రక్షణ సమస్యయొక్క సత్వరావశ్యకతను గుర్తించక అందునిమిత్తము వెంటనే శాసనము ప్రవేశపెట్టు ఉద్దేశ్యము కనుపర్చనందుకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని ప్లానింగు ప్రణాళికలలో గ్రామముల అభివృద్ధి అనే ఆశయము సిద్ధించుటకు తగినట్టియు దోహదము యిచ్చునట్టియు షరతులు పొందుపరుపబడనందున ఈ సభ విచారము తెలియజేస్తుయున్నది."

25th April, 1955] (Sri D. V. Subba Rao)

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి

"6-14 సంవత్సరముల మధ్య బాలబాలికలకు ఉచిత ప్రాథమిక విద్య గరపు విధానము ప్రభుత్వము ప్రవేశపెట్టనందులకున్నూ, విద్యావ్యాప్తికొరకు ఉన్నత పాఠశాలల సంఖ్య వృద్ధి పరచుటకు బదులు తగ్గించుట, మూసివేయుట చేయుచున్నందులకున్ను, కళాశాలల్లో విద్యాబోధన మాతృభాషలో జరుపనందున విద్యార్థులకు కలిగే కష్టము ప్రభుత్వము గుర్తించనందునన్ను, ఉపాధ్యాయులకు తగినంత జీవన భృతి యివ్వనందులకును, ఈ సభ విచారము తెలియజేస్తుయున్నది."

The amendments were duly seconded.

Sri B. Sankarayya.—నా పేరనవున్న సవరణలను ప్రతిపాదించుచున్నాను.

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"రెండవ పంచవర్ష ప్రణాళికకు స్కీములు తయారుచేయుటకు జమాబంది జరిపించడం రెండు నెలలు వాయిదా చేయగా జమాబంది జరిగేవరకు పినాల్టీలు వసూలు చేయడం ఆపమని రైతాంగం, శాసనసభ్యులు పంపిన విజ్ఞప్తులను పాటించి పినాల్టీలు వసూలుచేయడం ఆపమని చెప్పనందులకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"టెక్నికల్ కమిషను పంపిన సిఫార్సులను పాటించక ఆరువేల క్యూసెక్కుల నీటికి బదులుగా మూడువేల క్యూసెక్కుల నీరు పారుదలయేటట్లు కి.వి. కెనాల్‌ను రీమోడల్ చేయించుచున్నందులకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"లక్ష యకరాలకు పారుదలయిచ్చే కలిగిరి రిజర్వాయరు సప్లయి ఛానలు వెడల్పు చేయాలనీ రిజర్వాయరు క్రిందనున్న భూములు ఆయకట్టు ననుసరించి రీమోడల్ చేయాలని నెల్లూరుజిల్లా ప్లానింగు బోర్డు యేకగ్రీవంగా తీర్మానము చేసినప్పటికి సదరు తీర్మానాన్ని అమలు జరుపుతామని చెప్పనందులకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది"

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"రద్దుచేయక మిగిలియున్న ఇనాము శ్రోత్రియంవారీ విధానాన్ని రద్దుచేయుటకు కాలపరిమితి నిర్ణయించనందులకున్నూ, ఆ గ్రామాలలోని ఇనాం శ్రోత్రియం రైతులు చెరువు మరమ్మతులు లేక, పండకపోయినా శిస్తు రిమిషన్లు లేక రైతాంగం పడే అవస్థలను తొలగించుటకైనా నిర్దిష్ట ప్రతిపాదనలు తెలుపనందులకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"నెల్లూరు జిల్లాలో లక్షమందికి జీవనాధారము చూపుచుండిన మైకా పరిశ్రమ నేనాటికి క్షీణించి నేడు ఇరువది అయిదు వేల మందికి పనిచూపలేని స్థితి యేర్పడినప్పటికి సదరు మైకా పరిశ్రమను రక్షణ కల్పించే ప్రతిపాదనలను తెలుపనందులకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"రాష్ట్ర వ్యాపితంగా కౌలుదార్లను భూములనుండి తొలగిస్తూ ఉండగా, వారికి రక్షణ కల్పించుతామనే సూచనకూడ చేయనందులకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"ఆంధ్ర దేశములో చదువుకొని డిగ్రీలు సంపాదించి నిరుద్యోగుల విషయముగాని, శరీర కష్టము చేయుటకు సిద్ధమై పని దొరక్క అవస్థపడే నిరుద్యోగుల విషయముగాని ఈ నిరుద్యోగ సమస్య రోజురోజుకు విషమ పరిస్థితికి పోతున్నదన్న వాస్తవాన్ని గుర్తించి ఇందుకు నివారణోపాయములను సూచించనందులకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

Sri S. Vemayya:—నేను ఈ సవరణలను బలపరచుచున్నాను.

Sri A. Venkatarama Raju:—నా పేరన ఉన్న సవరణలను ప్రతిపాదించు చున్నాను.

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని గోదావరిపై నిర్మించాల్సిన ఉప్పూరు డామును పేర్కొననందులకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని ఏలేరు, ఎర్రకాల్వ రిజర్వాయరులను పేర్కొననందుకు ఈ సభ విచారము తెలియ జేస్తుయున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని 20 సంవత్సరములకు పూర్వం తయారుచేయబడ్డ బోర్డు స్టాండింగు ఆర్డర్లలో చాల భాగం ప్రస్తుత పరిస్థితులకు అనుగుణ్యంగా లేనందున అవి తిరిగి వ్రాయుటకు పూనికను పేర్కొన నందుకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

Sri N. Ramulu:—నేను ఈ సవరణలను బలపరచుచున్నాను.

Sri P. Satyanarayana:—నేను ఈ దిగువ సవరణలను ప్రతిపాదించుచున్నాను.

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని [illegible] ఈ విషయాన్ని పరిశీలించి రామమూర్తి కమిటీ కొన్ని [illegible] సదరు [illegible] పూర్తిగా రద్దుచేయాలనే సూచనను చేయనందులకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని [illegible]

విచారణ కమిటీ సిఫారసుల 1954 ను ఆంధ్ర ప్రభుత్వం ప్రతిఘటిస్తుందని ప్రకటించనందుకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"మిల్లుబట్టతోనున్న ధర పోటీవల్ల వెనకటికన్న ఎక్కువ గంటలు చేమగ్గంమీద పనిచేసి అప్పటికన్న తక్కువ మజూరితో మ్రగ్గుతున్న లక్షలాది ఆంధ్ర చేనేత పనివారికి మిల్లులకు కిట్టే రేటుకే నూలు సప్లయిచేసి వారి స్థితిని కొంచెమైనా బాగుపర్చే చర్య తీసికోగలమనే ప్రకటన లేనందుకు, ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"మిల్లు చీరలు మిల్లు ధోవతులు మీద చేనేత పరిశ్రమ రక్షణార్థం అదనపు అమ్మకపుపన్ను వేసే ప్రమేయమే లేనందుకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

Sri Vavilala Gopalakrishnaiah:—నేను ఈ సవరణలను బలపరచుచున్నాను.

Sri V. Visveswara Rao:—ఈ దిగువ సవరణలను నేను ప్రతిపాదించుచున్నాను.

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"రైతులు పండించు వ్యాపారపంటలకు, ఆహార పంటలకు ధరలు తగ్గిపోతున్నప్పటికి రైతులకు గిట్టుబాటైన ధరల నిలబెట్టుటకు తగు చర్యలు తీసుకొనే సూచనలు చేయనందులకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"బుడమేరు గుండేరులకు ముంపునివారణ స్కీములను పేర్కొనవందులకు ఈ సభ విచారం తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"పరిశ్రమలకు, వ్యవసాయమునకు ఉపయోగించే ఎలక్ట్రిసిటీ రేట్లను పెంచినందులకు ఈ సభ విచారం తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"10 రూపాయలు అంతకు లోపు శిస్తును మినహాయించుతూ గత ప్రభుత్వం చేసిన నిర్ణయములను అమలు జరపక దానిని తిరిగి పునరుద్ధరించి వసూలు చేయుటకు నిర్ణయించినందులకు ఈ సభ విచారం తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"[illegible] ద్వారా అప్పుల సౌకర్యం కలుగజేయు సూచనలు చేయనందులకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

[25th April, 1955

Sri G. Nageswara Rao.—నేను ఈ సవరణలను బలపరచుచున్నాను.

Sri Mohammad Tahsil:—ఈ దిగువ సవరణలను నేను ప్రతిపాదించుచున్నాను.

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని ప్రభుత్వమువారు వెనుకబడిన జాతుల అభివృద్ధికై మలయప్పన్ కమిటీ సిఫార్సులను అమలు జరిపే సూచనలు చేయనందుకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని, మదరాసు ఎస్టేటుల రద్దుచట్టము, ఏజన్సీ ప్రదేశములలోని అన్ని ఎస్టేటులకు వర్తింపచేయనందుకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది"

The amendments were duly seconded.

Sri S Kasi Reddi:—ఈ దిగువ సవరణలను నేను ప్రతిపాదించుచున్నాను.

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

'కాని ఖోస్లాకమిటీ సూచనల ప్రకారం నందికొండ ప్రాజెక్టు కుడికాలువ నిర్మాణం జరిపే సూచనలు లేనందుకు, ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"బంజరు భూములు అమ్మకం మొదలగు పద్ధతులు లేకుండా నందికొండ ప్రాజెక్టు నిర్మాణం జరుపుటకు హామీ యివ్వనందుకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"వెనుకబడిన ప్రాంతాలలోని ఎల్.ఎఫ్. ఆస్పత్రులను గవర్నమెంటు ఆస్పత్రులుగా మార్చే సూచన లేనందుకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి

"నెల్లూరు జిల్లాలోని మెట్టప్రాంతాల రైతుకూలీల కష్టాలను గుర్తించి వారు ప్రభుత్వానికి చెల్లించవలసిన జీవనభృతి, తక్కావి, వ్యవసాయక ఋణాలను వాయిదా వేసే విషయం ప్రస్తావించనందుకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"అడవులను రిజర్వుఫారెస్టుగా మార్చినప్పుడు ప్రజలకష్టాలను - సాగుభూములను వదలుట, సర్వే చేయించుట, గ్రామానికి దూరంగా ఫెన్సు వేయుట పశువులకు చిట్టడవులను వదలుట - దృష్టిలో పెట్టుకోనందుకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

25th April, 1955] (Sri S. Kasi Reddi)

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"ప్లానింగు పథకాలకు అయ్యే ఖర్చులో గ్రామప్రజలు సగభాగం నిరాశంగా యివ్వాలనే షరతు మెట్టప్రాంతాలకు వుపయోగకారి కానందున దానిని తగినవిధంగా మార్పుచేయనందుకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి

"విద్యాభివృద్ధిని దృష్టిలోపెట్టుకొని ఆర్థిక స్తోమతలేని జిల్లాబోర్డు హైస్కూళ్లను మూసి వేయము అని హామీ యివ్వనందుకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి

"మెట్టప్రాంతాల అభివృద్ధికి తగిన మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టు పొదిలి తాలూకా-మేకలేరు ప్రాజెక్టు - దర్శి - గుండ్లకమ్మ ప్రాజెక్టులకు తగిన ప్రాధాన్యతయిచ్చే సూచనలు లేనందుకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

Sri B. Sankarayya:—ఈ సవరణలను నేను బలపరచుచున్నాను.

Sri G. Nageswara Rao:—ఈ దిగువ సవరణలను ప్రతిపాదించుచున్నాను.

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"నందికొండ మొదలైన ప్రాజెక్టులకు సంబంధించిన బంజరు భూములను పేదలకు వుచితంగా పంపకము చేయకుండా వేలము వేసే పద్ధతిని పెట్టుటవల్ల ఈ సభ విచారము తెలియ జేస్తుయున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"గత ఆంధ్ర అసెంబ్లీ ఆమోదించిన బంజరు తీర్మానాన్ని అనుసరించి గతమునుండి పేదలు సాగుచేసుకుంటూన్న బంజర్లపై విధించబడుతూన్న పెనాల్టీలను రద్దుచేయకపోవుటచేతను ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"పర్మిట్‌కాలేదనే పేరుతో పంపకము చేయకుండా అప్పచేయబడిన అన్నిరకాల బంజర్లను వెంటనే పంపకము చేసే ఏర్పాటు చేయకపోవుటచేతను ఈ సభ విచారము తెలియజేస్తుయున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"ఇనాము జమాదార్లను తొలగించి రాజకీయ బాధితులకు ఇచ్చిన పట్టాలను రద్దుచేసి అసలు ఇనాము జమాదార్లకే పట్టాలు యివ్వకపోవుటచేత ఈ సభ విచారము తెలియజేస్తుయున్నది."

(Sri G. Nageswara Rao) [25th April, 1955

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

" గోదావరి కృష్ణ లంకభూములను బంజరు భూముల పథకములో చేర్చి ఎఫ్.ఎల్.సి. సొసైటీలకు, టెనెంట్సు కో ఆపరేటివ్ సొసైటీలకు పంపకము చేయుటనుగురించి, పంపకము చేసేలోపున ఎకరాకికి 25 రూపాయలకు మించకుండా భూసారాన్నిబట్టి రేటు కట్టి ఎఫ్.ఎల్.సి. సొసైటీలకు, టెనెంట్సు కో ఆపరేటివ్ సొసైటీలకు లీజ్‌కు యిచ్చుటను గురించి, 1364 ఫసలీలో ఏర్పడిన లంకపంటల నష్టాలకు రిమిషన్లు యిచ్చుటనుగురించి, సదరు ఫసలీలో రిమిషన్లకు సంబంధించి ప్రభుత్వము జారీచేసిన జి.ఓ ను 1364 వ ఫసలీ పంట నష్టాలకు కూడా అనువర్తింపజేసి రిమిషను పిటీషన్ల విచారణ జరిగేవరకు జప్తులు ఆపుచేయుటను గురించి, ఎఫ్.ఎల్.సి సొసైటీలకు లీజ్‌కు యిచ్చే లంకలలో పొగాకు మొదలయిన వ్యాపారపంటను పండిస్తే పెనాల్టీ విధిస్తామనే షరతును రద్దుచేయుటను గురించి ప్రస్తావించనందుకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది. "

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

" చిరకాలమునుండి ప్రభుత్వ పోరంబోకులలో యిండ్లు కట్టుకొని నివసిస్తూఉన్న పేద ప్రజలపై విధిస్తుఉన్న అధిక పెనాల్టీలను రద్దుచేసి వారికి పట్టాలు యివ్వకపోవుటచేతను, గత 8 సంవత్సరములలోను పేదప్రజలు పంపుకొన్న యిండ్ల దరఖాస్తుల నన్నింటినీ వెంటనే ఎంక్వైరీ చేసి సదరు స్థలాలను ఎంక్వైరు చేసి వారికి యివ్వకపోవుటచేతను ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది. "

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

" ఆర్థిక సాంఘిక విద్యావిషయాలలో ప్రభుత్వము హరిజనులకు కలుగచేస్తున్న ప్రత్యేక సౌకర్యాలను హరిజన క్రైస్తవులకుకూడా అనువర్తింపచేయక పోవుటచేతను ఈ సభ విచారమును తెలియజేస్తు యున్నది. "

**Sri S. Vemayya**:—నేను ఈ సవరణలను బలపరచుచున్నాను.

**Sri M. Nagi Reddi**:—నాపేరునఉన్న సవరణలను నేను ప్రతిపాదించుచున్నాను.

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

" కాని జిల్లాబోర్డులను పునరుద్ధరించి ఎన్నికలను వెంటనే జరుపుటకు కార్యక్రమం నిర్ణయించు విషయమై ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది. "

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

" కాని ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఆంధ్ర దేశంలో తగినంతగా పారిశ్రామికంగా అభివృద్ధిపరచు మార్గముల చేయనందుకు ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది. "

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని ఎన్నో సంవత్సరాలుగా సాగుచేసుకుంటున్నటువంటి లేదా సాగుకు లాయకైనటువంటి ఫారెస్టు బంజరు భూములను భూమిలేని నిరుపేదలకు ఉచితంగా పంచువిషయమై ప్రస్తావించనందులకు ఈ సభ విచారం తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"జాతీయ మంచినీటి సప్లయి పారిశుద్ధ్యం (National Water Supply and Sanitation Scheme for Rural Areas) అభివృద్ధిచేయుటకు ఆంధ్రదేశంలో నిర్ణయించబడిన నాలుగు యూనిట్లలోను 1954-55 సంవత్సరంలోనే పని ప్రారంభించుటకు ఆర్డర్లు జారీ చేయబడినప్పటికి 1955-56 సంవత్సరం జరుగుచున్నప్పటికి యింతవరకు కార్యక్రమం ప్రారంభించుటకు తగు సూచనలు లేనందుకు ఈ సభ విచారం తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని ఆర్థికంగా వెనుకబడిన ప్రాంతాలలో గ్రామాభివృద్ధి పనులకుగాను కొంత విరాళం కోరకుండానే ప్రభుత్వమే పూర్తిగ్రాంటునిస్తు గ్రామాభివృద్ధి పనులు చేయించు విషయం ప్రస్తావించనందులకు ఈ సభ విచారం తెలియజేస్తు యున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని 1950 సంవత్సర నూతన పంచాయతీ చట్టం ప్రకారం పంచాయతీ బోర్డులకు రావలసిన హక్కులను పొందు విషయంలో రివిన్యూ తదితర శాఖాధికారులవల్ల కలుగుచున్న యిబ్బందులను తొలగించుటకు చట్టాన్ని సవరణ చేయనందులకుగాను ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

The amendments were duly seconded.

Sri G. Yallamanda Reddi:—ఈ దిగువ సవరణలను నేను ప్రతిపాదించుచున్నాను.

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని ప్రభుత్వము ఎస్టేట్సునుండి తీసుకున్న ఫారెస్టులను వెంటనే సెటిల్‌మెంట్ చేసి గ్రామాలకు అనువైన విధంగా పనికిరాని చిన్న అడవులను వదలి, రిజర్వులైనులు వేయించనందున ప్రజలకు గలిగిన యిబ్బందులను గురించి ప్రస్తావించనందున ఈ సభ విచారము తెలియజేస్తు యున్నది."

(Sri G. Yallamanda Reddi) [25th April, 1955

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని ప్రభుత్వము ఆర్థిక సంబంధమైన ఏ షరతులు లేకుండాను, ఖోస్లాకమిటీ సూచించిన ప్లాను ప్రకారము మెట్టప్రాంతాలకు సంపూర్ణ ప్రయోజనము కలుగునట్లు నందికొండ ప్రాజెక్టును పంచవర్ష ప్రణాళికలో చేర్పించజాలని విషయము ప్రస్తావించనందుకు ఈ సభ విచారము తెలియ జేస్తుయున్నది."

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.

"కాని ప్రభుత్వము తక్కావి అప్పులను వాయిదా వేయని విషయము, జమాబంది అని పెనాల్టీల వసూళ్లు అపుచేయనందువల్ల కలిగిన యిబ్బందులను ప్రస్తావించనందుకు ఈ సభ విచారము తెలియజేస్తూ యున్నది."

Sri G. Nageswara Rao:—ఈ సవరణలను నేను బలపరచుచున్నాను.

MR. SPEAKER:—Now we shall proceed to the discussion of the motion and the amendments. Sri Rajeswara Rao will now speak.

Sri P. Sundarayya:—అధ్యక్షా, వారు మాట్లాడే ముందు ఒకవిషయం మీ దృష్టికి తీసుకరావలసి యున్నది. నేను పంపించిన 10 వ సవరణలో కొంతభాగం వదలివేయడంవల్ల ఆసవరణ అర్థరహితంగా తయారైనది. "రూటుబస్సులు, లారీలు వుపయోగించి ఓటర్లను తరలేస్తూ వుండడము, నేటికి తాము చెప్పిన అభ్యర్థులకు ఓటుచేయలేదని అనేక గ్రామాల్లో ఓటర్ల మీద భూస్వాములు పెత్తందారులు అనేక దౌర్జన్యాలను సాగిస్తూవున్న వాటిని అపుచేయలేక పోయినందులకు ఈ సభ విచారము తెలియజేస్తు ఉంది" అని మాత్రమే సవరణలో ఉన్నది. కాని నేనిచ్చిన సవరణలోని ఇతర విషయములను ఎందుకు తొలగించారో తెలియడంలేదు. నా సవరణలోని భాగాలు ఏ కారణంచేత తీసివేశారో తెలియక కార్యదర్శిగారిని అడిగితే, వారు నాకు లౌకికంగా తెలియజేసిన దానినిబట్టి "ఎన్నికలు కేంద్ర ప్రభుత్వంయొక్క ఆధీనంలో వున్నటువంటి విషయం కాబట్టి దానిని యిక్కడ చర్చించే అవకాశం లేదు, అందుచేత దానిని యిక్కడ వదలివేయడం జరిగింది" అని అనుకొంటున్నాను. ఈ విధంగా సవరణలో కొంత భాగాన్ని తొలగించవచ్చునేమో తెలియజేయ గోరుచున్నాను. గవర్నరుగారి అడ్రెసులో ఎన్నికల విషయం ఉదహరించబడినది కనుక వాటి నిర్వహణలో కనుపించిన మంచి చెడ్డల గురించి నా సవరణలో తెలియజేశాను.

Sri L. Lakshmana Das:—అధ్యక్షా, 10 వ సవరణ చర్చకు వచ్చినపుడు దాని క్రింద అప్పుడు మాట్లాడడం బాగుంటుంది. అందుచేత ఇప్పుడు యీవిషయము చర్చించకూడ దనుకుంటాను.

25th April, 1955]

MR. SPEAKER:—For Mr. Sundarayya's information, so that he may not make a long speech, I would like to tell him that the conduct of elections is directed by the Election Commission. The Provincial Government has no place in it except to carry out the orders of the Election Commission. The first part which is omitted in Mr. Sundarayya's amendment relates to the putting in the number of the ballot paper against the name of each voter when the ballot paper was issued. That was done under the instruction issued by the Election Commission. This Government or this House is not in a position to amend those rules. That is why I deleted it; for it is a subject relating to the Government of India; and it is also found in the list pertaining to the Government of India.

Sri P. Sundarayya:—గౌరవనీయులైన గవర్నరుగారియొక్క ప్రసంగంలో ఎన్నికల ప్రస్తావన వచ్చినపుడు "The smooth conduct of the election has won universal approbation and I am sure the House will join me in paying a well-earned tribute to all the officers" అని చెప్పినారు. గవర్నరు గారి ప్రసంగంలో ఎన్నికల ప్రస్తావన వచ్చినపుడు, సక్రమంగా ఎన్నికలు జరిగిన వన్నప్పుడు, అలా జరగలేదు కనుక, జరుగనందుకు విచారం సూచిస్తూ సవరణ ప్రతిపాదించే హక్కు సభ్యులకు వున్నది. అందుచేత గవర్నరు ప్రసంగంపై నేను తెచ్చిన సవరణలో రహస్య బాలెటు కాగితం బయటకు తెప్పించి భూస్వాములు, పెత్తందారులు ఒత్తిడిచేసి ఓటర్లు ఎన్నికలలో సక్రమంగా, స్వేచ్ఛగా పాల్గొనేటట్టు చేయలేదని ఆరోపిస్తున్నాను. తర్వాత యింకో క్లాజువున్నది.

MR. SPEAKER:—As the amendment now stands, route buses and lorries (రూట్ బస్లు, లారీలు ఉపయోగించి వోటర్లను చేరవేస్తు ఉండడం) relate to the Provincial subject, namely, road traffic. "నేటికి నాము చెప్పిన అభ్యర్థులకు వోటుచేయలేదని అనేక గ్రామాలలో వోటర్లమీద భూస్వాములు, పెత్తందార్లు అనేక దౌర్జన్యాలు సాగిస్తు ఉన్నవారిని అపుచేయలేక పోయినందుకు." This is law and order. So I find these two things relevant; and so far as the rule relating to the putting in of the number of the vote against the voter's name while the ballot paper was issued, it was done under the rules issued by the Election Commission; and we are not in a position to amend those rules. As such no discussion would be relevant, or would serve any useful purposes.

Sri P. Sundarayya:—నా సవరణలో వున్న అటువంటి మొదటి క్లాజు గురించి మీరు [illegible] చెప్పవంటేదు, ఓటర్లు స్వేచ్ఛగా ఎన్నికలలో పాల్గొనకుండా భూస్వాములు, పెత్తం [illegible] ఒత్తిడి చేస్తుంటే, [illegible] ఒత్తిడిలేకుండా స్వేచ్ఛగా [illegible]

ప్రోయారనేది law and order కు సంబంధించిన విషయంకాదు. అది తప్పకుండా చర్చనీయాంశం.

సవరణలో ఉదాహరణముల వివరాలు వుండటము పార్లమెంటరీ సాంప్రదాయము కాదని చెప్పుతున్నాను. భూస్వాముల, పెత్తందార్ల ఒత్తిడివల్ల ఓటర్లు స్వేచ్ఛగా ఓటు చేయడానికి వీలులేకపోయింది. ఇందుకు వివరములను సవరణలో చేర్చిన సవరణ పేజీలు, పేజీలు ఔతుంది. ఆ కారణంచేతనే specific instances ఇవ్వలేదు

MR. SPEAKER:—I omitted that clause for the reason that it is too vague. Unless you bring specific cases of coercion and oppression, or any of the other kind, it is vague and so I omitted it; and the second clause in the amendment, as it stands, will give you sufficient opportunity to discuss the subject. So let us close the discussion on this matter. The hon Member will be allowed to refer to it in his speech. Now Mr. Rajeswara Rao will proceed with his speech.

*Sri M. Rajeswara Rao:—అధ్యక్షా, ఆంధ్రరాష్ట్ర అవతరణ జరిగిన తర్వాత ప్రప్రథమముగా జరిగిన ఎన్నికల అనంతరము ఆంధ్రరాష్ట్రములోని అన్ని వర్గాలకు చెందిన ఆంధ్రులందరుకూడ ప్రాతినిధ్యము వహించగల శాసనసభ ఏర్పడి తనకార్యక్రమాన్ని కొనసాగించుచున్న యీ సందర్భములో ఆంధ్రరాష్ట్ర నిర్మాణముకోసము అచంచల త్యాగాలుచేసినటువంటి దేశభక్తి కొండా వెంకటప్పయ్య, కాశీనాథ నాగేశ్వరరావు, న్యాపతి సుబ్బారావు, వీరేశలింగం పంతులు, అమరజీవి పొట్టి శ్రీరాములుగార్లకు యీ సభవారు జోహార్లు అర్పిస్తారని నేను భావిస్తున్నాను. ఇట్టి మహత్తర సమయములో నూతనంగా ఏర్పడిన యీ ప్రభుత్వము ప్రస్తుతము సాగిస్తున్న కార్యక్రమాలను, యికముందు సాగించే కార్యక్రమాలను, ప్రభుత్వ విధానాలను వివరిస్తూ గౌరవనీయులైన గవర్నరుగారి ఉపన్యాసానికి సభవారి తరఫున ధన్యవాదాలు అర్పించే గౌరవము తాత్కాలికంగా నాకు దక్కినప్పటికి యీ గౌరవము నన్ను ఎన్నుకొన్న నా నియోజకవర్గ ప్రజలకు దక్కినదని నేను భావిస్తున్నాను. నా నియోజకవర్గము యావద్భారత దేశానికి కమ్యూనిస్టుల కంచుకోట అని భావించబడి, ఆర్థికంగా కాకపోయినా రాజకీయముగా చాలా ముందుకు వచ్చిందని గత ఎన్నికలలో 84 % ఓట్లు పోల్ అయినదానివల్ల తెలియగలదు. అఖిలభారత కమ్యూనిస్టు పార్టీ మాజీ కార్యదర్శి చంద్ర రాజేశ్వరరావు, ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ కార్యదర్శిగా చెప్పుకున్న గుంటూరు బాపనయ్య పోటీచేశారు. తాము తప్పకుండా గెలిచి తీరుతామని, అట్లు గెలువకపోయినపుడు తమ ముద్రలను గొరిగించుకొని గాడిదలనెక్కి ఊరేగెదమని వారు ఉపన్యాసాలలో చెప్పుకున్నారు. కాని అఖిలభారత కాంగ్రెస్ సామాన్య ప్రతినిధులు వారిని ఓడించారు. ఇటువంటి మహత్తరమైన యీ నియోజకవర్గములో కాంగ్రెస్ విజయానికి, కాంగ్రెస్ ప్రతిభకు మన ఏకైక నాయకుడైన జవహర్లాల్ నెహ్రూ నాయకత్వానికి వన్నె తెచ్చిన యీ నియోజకవర్గ ప్రజలకు యీ గౌరవము దక్కినదని నేను భావిస్తున్నాను.

25th April, 1955] (Sri M Rajeswara Rao)

ఈనాడు గవర్నర్‌గారు తమ వుపన్యాసములో అనేక విషయాలనుగురించి వివరిస్తూ ముందు ఎన్నికలను గురించి ప్రస్తావించారు. ఈ ఎన్నికలు సక్రమంగ నిర్వహింపబడలేదని ఒక సవరణ పుచ్చలపల్లి సుందరయ్యగారు ప్రతిపాదించారు ఇది చాలా ఆశ్చర్యంగావున్నది. ఈ ఆంధ్ర ఎన్నికలు ప్రపంచ దృష్టిని ఆకర్షించాయి. ఇతర దేశములనుండికూడ యీ ఎన్నికల సంరంభము చూడడానికి అనేకమంది వచ్చారు. ఆంధ్ర ఎన్నికలలో ఒకకోటి పదిహేను లక్షల జనాభాలో 86 లక్షలు ఓటు చేశారు. అంటే 100 కి 77 మంది ఎన్నికలలో పాల్గొన్నారు. యిందువల్ల ఆంధ్రదేశము రాజకీయంగా ఎంత ముందుకువచ్చిందో ప్రపంచానికి తెలిసింది. ఈ ఎన్నికలు ప్రజాస్వామ్యానికి నియంతృత్వానికి మధ్య జరిగిన పోరాటమని నేను భావిస్తున్నాను. ఈ పోరాటములో అన్నిపక్షల అఖిలభారత నాయకులువచ్చి ప్రచారముచేస్తూ యీ ఎన్నికలలో పాల్గొన్నారు. అందుచేత ఆంధ్ర ఎన్నికలు ప్రపంచముయొక్క దృష్టిని కేంద్రీకరించుకొన్నవని నేను భావిస్తున్నాను. ఈ ఎన్నికలలో విప్లవకర శక్తులు ఓడిపోయాయి, ప్రజాస్వామిక శక్తులకు, జాతీయ వాదులకు అఖండవిజయము చేకూరినది. ఈ ఎన్నికలలో ప్రజాస్వామ్య పక్షల విజయానికి తోడ్పడిన ప్రజలకు హృదయపూర్వకమైన ధన్యవాదాలు తెలియజేస్తున్నాను. ఈనాడు జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్‌కు వచ్చిన అఖండవిజయము 1936 సంవత్సరములో కాంగ్రెస్‌కు వచ్చిన విజయములాంటిది. దేశ స్వాతంత్ర్యము కొరకు పోరాటం జరుపుతున్న ఆ రోజుల్లో కాంగ్రెసుకు లభించిన విజయమునకు ఎంత ప్రాముఖ్యతవున్నదో ఆర్థిక సమానత్వము కోసము పోర్లాడుతున్న యీ రోజుల్లో అఖిలభారత కాంగ్రెస్‌కు కలిగిన విజయమునకుకూడ అంత ప్రాముఖ్యము వుందని నేను భావిస్తున్నాను. అందుచేత యీనాడు ప్రపంచములోని రాజ్యాలన్నీకూడ యీ ఆంధ్రదేశ భవిష్యత్తును గురించి చాల ఆదుర్దతోను ఆశతోనున్నారు అని నేను అనుకుంటున్నాను. ఈ సందర్భములో చరిత్రాత్మకమైన యీ ఎన్నికలను నిష్పాక్షికముగా నిర్వహించినందులకు ఎన్నికల సిబ్బందికి, పోలీసు సిబ్బందికి ముఖ్యంగా మన పుల్లారెడ్డిగారికి. నరసింహముగారికి ఎన్నికలలో సహకారమిచ్చిన ప్రజానీకానికి, అన్ని ఏర్పాట్లు చేసిన గవర్నర్‌గారికి యీ సభ తమ కృతజ్ఞత తెలియజేస్తుందని భావిస్తున్నాను. ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన వెంటనే మన ఆంధ్రకేసరి నాయకత్వముక్రింద 18 నెలలు పనిచేసిన మంత్రివర్గము యీ రాష్ట్రమువచ్చిన క్రొత్తలో చాల క్లిష్టపరిస్థితులను ఎదుర్కొనవలసి వచ్చినది. ఇక్కడవున్న ఉద్యోగస్థులకు వసతులను ఏర్పాటుచేసినది, హైకోర్టును ఏర్పాటుచేసినది. Sri Vekateswara University స్థాపించినది. నందికొండ ప్రాజెక్టు విషయమై కేంద్రప్రభుత్వముతో సంప్రదింపులు జరిపి ఘన విజయము సంపాదించినది. ఇన్ని ఘనకార్యాలను సాధించిన గత ప్రభుత్వంకూడా యీఅఖండ విజయానికి కారణభూతమైనది. అందులకే సభవారు గత మంత్రి వర్గానికి కృతజ్ఞులై వుంటారనుటలో సందేహంలేదు. ప్రజాశ్రేయస్సే తమ కర్తవ్యమని భావించి ప్రజాప్రతినిధులను గురించి హెచ్చరించి ప్రజాస్వామికపక్షల అఖండ విజయమునకు తోడ్పడిన ఆంధ్రపత్రిక, ఆంధ్ర పత్రికలకు శాసనసభ్యులు కృతజ్ఞులై యుండగలరు. మన్న గవర్నర్‌గారు చేసిన ప్రసంగమును చర్చించేముందు, ఆయా రాష్ట్రప్రభుత్వాలు రాష్ట్ర అభ్యుదయంకోసం కొనసాగిస్తున్న కార్యక్రమం, అనుసరిస్తున్న విధానాలు మన రాజ్యాంగ చట్టంలోని 39, 41, 46 నిబంధనలకు అనుగుణ్యముగా ఉన్నవా లేవా అని పరిశీలించవలసివున్నది. జాగ్రత్తగా పరిశీలిస్తే యీ ప్రభుత్వము కొనసాగిస్తున్న కార్యక్రమము, అనుసరిస్తున్న విధానాలు అందుకు అనుగుణంగానే వున్నట్లు

స్పష్టంకాగలదు. ఈనాడు దేశముయొక్క అభివృద్ధికోసము అఖిలభారత కాంగ్రెస్ అధ్వర్యాన నెలకొల్పబడిన కేంద్రప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వాలుకూడ ఎంతో కృషిచేస్తున్నవి. దాదాపు 2,200 కోట్ల రూపాయలు ప్రథమ పంచవర్ష ప్రణాళిక నిర్వహణకు కేటాయించబడినవి. అందులో మన ఆంధ్రరాష్ట్రపు వాటా దాదాపు 58.66 కోట్లు. ఇందులో గత సెప్టెంబర్ చివరకు 34 కోట్ల 63 లక్షలు ఖర్చు అయిందనిన్నీ, రేపు మార్చి చివరకు దాదాపు 100 కి 70 వంతులు ఖర్చు అవుతుందనిన్నీ గవర్నర్‌గారు సూచించారు.

దీనినిబట్టి వచ్చే మార్చినెల నాటికి మొత్తం డబ్బు ఖర్చు అవుతుందని దానివల్ల కొంత ఫలితం పొందగలమని ఆశిస్తున్నాము. ఈ ప్రథమ పంచవర్షప్రణాళిక మూలంగా పెద్దఅభివృద్ధి కార్యక్రమాలు ఏర్పాటు కాబడ్డాయి. వాటి ఫలితాలు రావాలంటే కొంతకాలం వేచివుండాలి. ఈ ప్రణాళికను పురస్కరించుకొని రెండు కమ్యూనిటీ ప్రాజెక్టులు, రెండు కమ్యూనిటీ డెవలప్‌మెంటు బ్లాకులు, 27 నేషనల్ ఎక్స్‌టెన్‌షన్ స్కీములు పనిచేస్తూవున్న విషయము నిజమే అయినప్పటికి సామాన్య ప్రజానీకానికి వీటివల్ల ఏమైనా లాభంవున్నదా అని కొందరికి అనుమానం వుంది. వాటి ఫలితాలు పొందడానికి కొంతకాలం వేచివుండాలి. సామాన్య మానవుని అభివృద్ధికోసమే ద్వితీయ పంచవర్ష ప్రణాళికను ప్రభుత్వం సంకల్పించింది. గ్రామాలకు అవసరమైన అభివృద్ధి ప్రణాళికను ఎట్లా సాధించాలనే విషయంలో ప్రభుత్వం ఉత్తరువులు జారీచేసింది. ఆ యా గ్రామాల అభివృద్ధికోసము ప్లానింగ్ కమిటీలు పనిచేస్తున్నాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక విశేషం ఏమిటి? ఈనాడు ఏ పెద్ద ప్రాజెక్టువల్ల వచ్చే ఫలితాన్ని అనుభవించేవరకు కావలసిన ఆర్థికస్తోమత సామాన్య మానవునికి లేదు. నిరుద్యోగ సమస్య పరిష్కరించటానికి, 10-15 సంవత్సరాలలో సామాన్య మానవుని ఆదాయాన్ని రెట్టింపు చేయడానికి, అయిదువేల కోట్ల రూపాయల ఖర్చుతో ద్వితీయ పంచవర్ష ప్రణాళికను అమలుపర్చటానికి కృషిచేస్తున్నారు. అందులో కొంతభాగం మన రాష్ట్రానికి సంబంధించి వున్నది. ఇంతవరకు పంచవర్ష ప్రణాళిక అమలుపరస్తూ ప్రజల అవసరాల మాట ఆలోచించాల్సిన బాధ్యత కేవలం ప్రభుత్వంమీదనే వున్నది. కాని వీటిని అమలుచేయడానికి ప్రయత్నం చేయడం, దానికి డబ్బు లేకపోవడం, ఒక వేళ చేసినా ప్రజామోదం పొందనిది కాబట్టి ఎవరిఇష్టం వచ్చినట్లు వారు చేయడంవల్ల నిరుపయోగం కావడం జరిగింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఇట్లాకాకుండా ప్రజల అవసరాన్నిబట్టి జరుగుతుంది. ప్రజలరాజ్యం కాబట్టి, ప్రజలకోసమే ప్రభుత్వం కాబట్టి ప్రజల అవసరాల మాట నిర్ణయించుకోవలసిన బాధ్యత ప్రజలమీదే వున్నది.

అందుచేత గ్రామాల అవసరాలు గ్రామంలోవుండే ప్రజలు నిర్ణయించుకోవలసి వున్నది. అప్పుడు ప్రభుత్వం ముందుకువచ్చి సహాయంచేయడానికి ప్రయత్నిస్తుంది. మహత్తరమైన ఈ కార్యభారాన్ని ప్రభుత్వం సంకల్పించిన రీతిగా పూర్తిచేయడానికి ప్రజాస్వామిక వాదులే కాకుండా అందరూ కూడా సహకారం ఇవ్వాలని కోరుతున్నాము. ముందుగా, గవర్నరుగారి ప్రసంగం చూస్తే వ్యవసాయాభివృద్ధి గురించి, దానికి కావలసిన పెట్టుబడుల సౌకర్యాలగురించి ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు గవర్నరుగారు చెప్పారు. నందికొండ, తుంగభద్ర high level channel, వంశధార ప్రాజెక్టు గురించి చెప్పారు. దాదాపు 122 కోట్ల రూపాయలు ఖర్చయ్యే నందికొండ ప్రాజెక్టు గురించి గత ఎసెంబ్లీలో, మద్రాసు రాష్ట్రంలోవుండగా కూడా, వాదోపవాదాలు

25th April, 1955] (Sri M. Rajeswara Rao)

జరిగాయి. చివరకు ఈ ప్రాజెక్టు నిర్మాణానికి అవకాశం ఏర్పడింది. ఈ ప్రాజెక్టు నిర్మించే సందర్భములో కేంద్ర ప్రభుత్వం సహాయం మనకు విరివిగా కావలసియున్నది. ఈ సందర్భంలో కేంద్ర ప్రభుత్వం కొన్ని షరతులు విధించినది. అభివృద్ధి పన్ను వేయడం నీటిసుంకాలు వేయడం, బంజరుభూములను అమ్మడం అనేవి యిందు ముఖ్యమైనవి.

ఈ మూడు షరతులను అంగీకరిస్తే ఈప్రాజెక్టు నిర్మాణానికి కావలసిన డబ్బు ఇవ్వడానికి కేంద్ర ప్రభుత్వం అంగీకరించినట్లు గవర్నరుగారు చెప్పారు. ఈ షరతులను ఆంధ్ర ప్రభుత్వం ఆమోదించింది కాబట్టి వీటినిర్మాణం త్వరలో జరుగుతుందని ఆశించవచ్చును. ఇప్పటికే మాచెర్లనుంచి నందికొండ dam site కు రోడ్డునిర్మాణం జరుగుతున్నది. రైల్వేలైను నిర్మాణం ప్రారంభం అయినది. అయితే ఈ మూడు షరతులు ఆమోదించినందుకు ప్రభుత్వంవారిని అనేకరకాలుగా విమర్శలు చేస్తున్నారు. బంజరుభూములు ఎందుకు అమ్మాలి? అభివృద్ధిపన్ను ఎందుకు వేయాలి? అని అనేకమంది విమర్శలు చేస్తున్నారు. ప్రభుత్వం ఈ విషయం మంచి చెడ్డలు ఆలోచించారని చెప్పడానికి నాకు ఏవిధమైన సందేహం లేదు. 122 కోట్ల రూపాయల విలువగల ప్రాజెక్టు నిర్మించవలసి యున్నది. మనం ఇప్పుడే అప్పులపాలై యున్నాము. ఈ కార్యభారాన్ని మన ప్రభుత్వం భరించాలంటే ఈ డబ్బును ఏవిధంగా సేకరించగలము? ఇప్పటికే వున్న అప్పును ఎట్లాతీర్చగలము? ప్రభుత్వం ఈ ప్రాజెక్టు తలపెట్టినప్పుడు దీనిక్రింద వుండే భూములు అభివృద్ధి అవుతాయి. విలువలు పెరుగుతాయి. ఈ ఉపయోగాలు పొందినందున వారిమీద ప్రభుత్వం పన్ను వేస్తే పొరపాటు కాజాలదు. ఒకప్రాంతం కొంత ఖర్చుద్వారా అభివృద్ధిలోనికి వచ్చినప్పుడు ఆ ప్రాంతంలో అభివృద్ధిపన్ను వేయడం సామాన్యమైన విషయం. అభివృద్ధి చెందినవారే పన్నులను యివ్వకపోతే, ముందు మనమే కార్యక్రమాన్ని చేయకోడానికి వీలులేదు. మనం చేసుకొన్న అప్పులు తీర్చడానికి వీలులేదు. ఎవరికీ ఇబ్బందిలేకుండా ఈ పన్ను వేయడానికి ప్రభుత్వం అంగీకరించింది. దీనిని సభ్యులు బలపరచాలని ప్రార్థిస్తున్నాను. బంజరుభూముల అమ్మకం గురించి చాలామందికి ఏవో అభిప్రాయాలున్నాయి. ఈ విషయాన్ని నేను జాగ్రత్తగా ఆలోచించాను. ఇదివరకు శాసనసభలో బంజరుభూములను పేదలకు ఉచితంగా పంచాలని ఒకతీర్మానం పాసైనది. అటువంటి తీర్మానం పాసైయుండగా ఇప్పుడు బంజరు భూములను అమ్మాలని చెప్పడం సమంజసం అవుతుందా అని విమర్శలు చేస్తున్నారు కాని మనం ఆలోచించవలసింది ఒకటి వున్నది. ఈ షరతు ఈ ప్రాజెక్టుక్రింద సాగులోనికి వచ్చే బంజరులకు మాత్రమే సంబంధించినట్టిది. అటువంటి బంజరుభూములను మాత్రం అమ్మకంపెట్టాలి. మిగతా బంజరులు ఇదివరకటి తీర్మానం ప్రకారం ఉచితంగా పంచవచ్చును. పోతే పేదప్రజానీకం కొనుక్కోడానికి వీలుగా మాత్రం ప్రభుత్వం వేలం విషయంలో కొద్దిపాటి రేట్లను నిర్ణయించడానికి ఆలోచిస్తుందని చెప్పడానికి సందేహం లేదు. ఇక ప్రభుత్వం భూమిమీద పన్ను వేయడమనేది ఏమీ క్రొత్తసంగతి కాదు. ఈ మూడు షరతులు ఆమోదించారంటే ఆంధ్ర ప్రజల సర్వతోముఖాభివృద్ధి సత్వరంగా జరగాలనే ఉద్దేశంతో తప్ప మరొకటికాదు. కనుక గౌరవ సభ్యులందరూ దీనికి అంగీకరించి ఈ ప్రాజెక్టు నిర్మాణానికి సంబంధించిన ప్రోత్సాహ ప్రభుత్వంతో ప్రభుత్వానికి కృతజ్ఞత తెలియజేస్తారని ఆశిస్తున్నాను.

మనకు ఇంకా అనేక ప్రాంతాలలో minor irrigation ప్రాజెక్టులు నిర్మాణం కావలసిన అవసరమున్నది. వీటికి చాలాడబ్బు కావలసియున్నది. వీటికొరకై పదికోట్ల రూపాయలు అప్పుగా ఇవ్వవలసినదని కేంద్ర ప్రభుత్వాన్ని మన ప్రభుత్వము కోరడం చాలాసంతోషింపదగినవిషయం.

MR. SPEAKER:—The hon. Member will carry on for one minute more.

Sri M. Rajeswara Rao:—అందుచేత వ్యవసాయాభివృద్ధికిగాను ఈ minor projects ను నిర్మించుకోవడానికి కావలసినంత డబ్బు యిప్పుడు మనవద్దలేదు. దాన్ని అభివృద్ధి పన్నుమూలంగా వసూలుచేసుకోవలసి యున్నది 1952 వ సంవత్సరంలో ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో శ్రీ రాజగోపాలాచారిగారు ఈ అభివృద్ధి పన్నును ప్రవేశపెట్టవలెనని ప్రయత్నించేశారు. కాని అప్పుడు అది జరుగలేదు. కనుక ఇప్పుడు మరల ఈ ప్రభుత్వం దానిని విధించదలచారు. ఇది మన ఆర్థిక పరిస్థితులనుబట్టి మాత్రమే వేయవలసి వచ్చిందని సభ్యులందరు అంగీకరిస్తారని ఆశిస్తున్నాను.

తరువాత మన దేశంలో భూమిలేని బీద రైతాంగానికి వ్యవసాయ కూలీలకు భూమిని పంచాలనీ చాలాకాలంగా ఆందోళన జరుగుచున్నది. అందుచేత ఈ సమస్యను పరిష్కరించుట కొరకు గత ప్రభుత్వము Land Reforms Committee వేసింది. ఆ కమిటీ ఈ విషయాన్ని పరిశీలిస్తున్నది. ఆ కమిటీ తమ పరిశీలన పూర్తిఅయిన తరువాత ఒక నివేదిక ప్రభుత్వానికి సమర్పిస్తుంది. ఆ నివేదిక ప్రభుత్వమునకు అందినతరువాత, దానిమీద చర్య తీసుకోబడునని గవర్నరుగారి ప్రసంగములో సూచింపబడినది. ఆ విధంగా ఉన్నాకూడా సభ్యులు దాన్నిగురించి మరల మరల ప్రస్తావించడం చాలా విచారకరంగా యున్నది.

Land reforms తప్పకుండా వస్తాయి. ఇందులో సందేహములేదు. కాని మన రాజ్యాంగంలో Article 31 ప్రకారం, ఎవరి ఆస్తినైనా స్వాధీనపరచుకోవలసి వస్తే, దానికి నష్టపరిహారం ఇవ్వవలసియున్నది. ఈ నిబంధనను అతిక్రమించడానికి గాని, రాజ్యాంగాన్ని సవరించడానికి గాని మనకు ప్రత్యేకమైన హక్కులులేవు. దీనిని గురించి అక్కడ పార్లమెంటులో తీర్మానాలు pass కావడం, రాజ్యాంగానికి సవరణ తీసుకురావడం మనకందరికి తెలిసిన విషయమే. అసలు, దేశములో అన్నిరాష్ట్రాలకంటె ముందుగా జమీందారీలను రద్దుచేసినటువంటి అదృష్టం మన ఆంధ్రరాష్ట్రానికే దక్కింది. దానికి నాయకులైన కళా వెంకట్రావుగారు యిక్కడే వున్నారు. జమీందారీలను రద్దుచేసినటువంటి వారికి ఇనాములను రద్దుచేయాలనేది పెద్ద గొప్పపని కాదు. డబ్బుంటే నిముషంలో చేయవచ్చు. కాని ఈ సంస్కరణ ఏవిధంగా తీసుకురావాలి, డబ్బు ఏవిధంగా వసూలుచేయాలనే విషయాలను ఆలోచించాలి. మనమెన్నో అభివృద్ధి కార్యక్రమాలు చేయవలసియున్నది. ప్రాజెక్టులు కట్టవలసియున్నది. ఉద్యోగస్థుల జీతాలు పెంచవలసియున్నది, ఇంకా ఎన్నోపనులు చేయవలసియున్నది. వీటన్నిటికి డబ్బులేదు. గత సంవత్సరం మన బడ్జెటులో మూడుకోట్లు deficit వచ్చింది. ఈ సంవత్సరంకూడ deficit వస్తుందేమో తెలియదు. ఈలాంటి పరిస్థితులలో మనకు అభ్యుదయ కార్యక్రమాలను సాధించాలని కుతూహల

ముంచే, అసలు కొత్తపన్నులు విధించవద్దనడంలోని భావమేమో అర్థంకావడంలేదు. అసలు ఈ 10 రూపాయలలోపు శిస్తు మినహాయింపు రద్దుచేస్తున్నారంటే, ఇది కొంతకాలమువరకు తాత్కాలికంగా మాత్రమే చేస్తున్నారు. ఈ విధంగా చేస్తున్నారంటే, కేవలం మన బడ్జెటు లోటును సవరించడానికే కాకుండా, మన అభివృద్ధి కార్యక్రమాలకొరకు వినియోగించుటకు కూడ చేస్తున్నారేగాని ఇందులో వారికి దురుద్దేశ్య మేమిలేదు. కనుక సభ్యులందరు ఈ విషయంలో ప్రభుత్వానికి దోహద మిస్తారని ఆశిస్తున్నాను.

ఇక ఈనాడు దేశంలో నూటికి 80 మందికిపైగా వ్యవసాయంమీద ఆధారపడిఉండే వ్యవసాయ కూలీలు ఉన్నారు. అందులో 100కి 75 మంది భూమిలేని వ్యవసాయ కూలీలున్నారు. వారికి కనీసవేతనాల చట్టాన్ని 14 గ్రామాలలో అమలు జరుపుతూ, దాని అనుభవమును పురస్కరించుకొని మిగతాచోట్ల అమలు జరుపుతామనికూడ గవర్నరుగారి ప్రసంగంలో చెప్పబడింది. ఈ సమస్య చాలా ముఖ్యమైనటువంటిది. దీనిని త్వరగా పరిష్కరించకపోతే ప్రమాద మేర్పడుతుందని ప్రభుత్వానికి తెలుసును. అదేవిధంగా Employees State Insurance Act ను ప్రవేశపెడుతున్నారు. దీనివలన గర్భిణీస్త్రీలకు, జబ్బుచేసినవారికి, దెబ్బలు తిన్నవారికి, జీవనాధారం కల్పించడం జరుగుతుంది, ఇది చాలా సంతోషకరమైనటువంటి విషయము.

ఇక హరిజనులకు, చేనేత పరిశ్రామికులకు ప్రభుత్వము చేస్తున్నటువంటి సహాయం మరువరానిది. హరిజనులకు ఉచితంగా ఇళ్ల స్థలాలిస్తున్నారు, ఉచితంగా విద్య చెప్పిస్తున్నారు, ఉచితంగా hostels పెట్టిస్తున్నారు; బంజరుభూముల విషయంలోగాని, ఉద్యోగాల విషయంలోగాని వారికి తగు ప్రాతినిధ్యమిస్తున్నారు, దేవాలయ ప్రవేశచట్టము మొదలగు చట్టాలద్వారా వారి అస్పృశ్యతా నివారణకు ప్రభుత్వము కృషిచేస్తున్నారు; ఇప్పటికే హరిజనులకు చాలాడబ్బు ఖర్చుపెట్టారు. అయితే దానివల్ల అనుకొన్నంత ఫలితము రాలేదనే సందేహమున్నది. దీనికి కారణం ఈ హరిజనాభివృద్ధికిగాను ప్రభుత్వము అవలంభిస్తున్న విధానములోని లోపమేనని అనుకొంటున్నాను. హరిజనుల కొరకై ఖర్చుపెడుతున్న డబ్బు సద్వినియోగం కావాలంటే, దానికి తగిన ఫలితం రావాలంటే, ప్రస్తుతం ప్రభుత్వం అవలంబిస్తున్న విధానంలో మార్పు తీసుకరావాలి. ఇక చేనేత పారిశ్రామికుల విషయంలో సహకార సంఘాలకు షేరుధనాన్ని మంజూరు చేయడంద్వారా, రిబేటును యివ్వడంద్వారా State Handlooms Co-operative Society ని నెలకొల్పి ప్రోత్సహించి, అప్పులుకూడ ఇస్తూ చేనేత పరిశ్రమకు ఈనాడు ప్రభుత్వం చేస్తున్నటువంటి సహాయము మరువరానిది; ఈనాడు చేనేత కార్మికులకు Central Handloom Cess Fund నుండి వస్తున్న సహాయము వారికి తెలుసును. తప్పకుండా చేనేత కార్మికులు ఈనాడు ప్రభుత్వాన్ని సమర్థించగలరని నమ్ముచున్నాను. అదేవిధంగా, వెనుకబడిన జాతులకు, scheduled tribes కు, backward classes కు ప్రభుత్వం ఈనాడు చేస్తున్నటువంటి సహాయం, వారిమీద అవలంబించ జరుగుతున్న విధానం చాలా ప్రోత్సాహకరంగా ఉన్నవి.

Sri R. B. Ramakrishna Raju:—అయ్యా, ఈ ఉపన్యాసాలకు ఏదైనా కాలపరిమితి ఉన్నదా? ముందుగా తెలిపితే, దానికి తగినట్లుగానే ఉపన్యాసాలు ఏర్పాటుచేసుకొనుటకు వీలుంటుంది.

MR. SPEAKER:—I would like to fix half an hour for Leaders and ten minutes to other members to-day. Mr. Rajeswara Rao has already take half an hour and he will close his speech now.

Sri M. Rajeswara Rao :—దయచేసి ఇంకొక అయిదు నిమిషాలు ఇవ్వవలసిందని కోరుతున్నాను.

MR. SPEAKER:—Two more minutes will be given to you.

Sri M. Rajeswara Rao:—అంతేకాకుండా, విద్యకోసం ప్రభుత్వము ఈనాడు 17.6 per cent ఖర్చు పెడుతున్నప్పటికీ ఒకప్రక్క నిరుద్యోగ సమస్య తగ్గలేదు, సరిగదా నానాటికి ఎక్కువే అగుచున్నది. మరోప్రక్క నిరక్షరాస్యత అలాగేవున్నది. "Illiteracy is an inflamable material for political agitation" అని మనందరకుతెలుసు. నిరక్షరాస్యతను వెంటనే నిర్మూలించాలి. నిరుద్యోగ సమస్య తగ్గించడంకోసం 1000 schools పెడతామని అన్నారు. కాని, విద్యావిషయంలో ఖర్చవుతున్న డబ్బు సక్రమంగా ఖర్చు పెట్టబడడం లేదు. ఒకప్రక్క ఉపాధ్యాయులకు ఉన్నజీతాలే చాలవని అంటున్నాము. కాని అసలు యిప్పుడిస్తున్న కొద్ది జీతాల్లోకూడా మేనేజర్లు చాలా మినహాయింపు చేస్తూ ఉపాధ్యాయులను బాధిస్తున్నారు, అందుచేత విద్యకోసమై డబ్బు జాగ్రత్తగా ఖర్చుపెట్టి, విద్యావిధానంలో కూడ తగిన మార్పు తీసుకురావాలని కోరుతున్నాను. ఈనాడు విద్యావిధానం ప్రజలను బానిసలుగా గుమాస్తాలుగా మాత్రమే చేసేవిధంగా ఉన్నదేగాని, స్వతంత్రముగా సంపాదించుకోడానికి వీలులేకుండాయున్నది. అందుచేత ఈ విద్యావిధానంలోకూడ తగిన మార్పులు తీసుకువస్తారని ఆశిస్తున్నాను.

తరువాత, ముఖ్యంగా ఉద్యోగస్థుల గురించి, గవర్నరుగారు తమ ఉపన్యాసంలో చెప్పకపోయినప్పటికీ, ఒకవిషయం మనవి చేస్తున్నాను. ఈనాడు నిరుద్యోగులకు, మాజీగిత పనివారికి జీవనాధారము కల్పించే విషయములో ప్రభుత్వము తీసుకొన్న చర్యలగురించి చర్చించడానికిని, విమర్శించడానికిని అవకాశంలేదు. అప్పన్నగారు, పిడుకొండ రామరావుగారు ఉన్నారు. కనుక ఆ విషయమై ఇంక చెప్పవలసిన అవసరంలేదు. కాని ఉద్యోగస్థుల గురించి, ప్రస్తుతం పరిపాలనలో ఉన్న లోపాలను గురించి మనవిచేస్తున్నాను. నేడు మనప్రభుత్వం ఉద్యోగస్థులకు గాను 49.6 % డబ్బు ఖర్చుపెడుతున్నారు. ఉద్యోగస్థులను గూడ పెంచుతున్నారు కాని పరిపాలనలో ఏమి improvement మాత్రం కనబడటం లేదు. ఇదివర కున్నటువంటి delays యేమీ తగ్గడంలేదు, బహూశా ఇది Tottenham system వల్ల ఏర్పడిన లోపమేనను కొంటాను. ఏది ఎలావున్నా ముఖ్యంగా N.G.Os. విషయంలో ప్రభుత్వం తగు శ్రద్ధ తీసుకోవలసి యుంటుంది, ప్రభుత్వ పరిపాలనంతా N.G.Os. మీదనే ఆధారపడి ఉంటుంది. ఆంధ్రరాష్ట్ర అభ్యుదయంకోసమై, శ్రేయోరాజ్యస్థాపన కోసమై ప్రభుత్వం చేస్తున్న కృషికి పక్షులంతా తగు చేయూత నివ్వవలసిందని కోరుతూ ఇంతటితో సెలవు తీసుకొంటున్నాను.

Sri P. Sundarayya:—అధ్యక్షా, గవర్నరుగారి ప్రసంగమునకు అభినందనలు తెలుపుచూ............

Hon. Sri G. Latchanna:—అధ్యక్షా, ఇపుడు మన రాజేశ్వరరావుగారు అభివందన తీర్మానమును ప్రతిపాదించారు. కనుక దానిని బలపరచేవారు ఇతర సభ్యులకంటె ముందు మాట్లాడవలసి యుంటుందనుకొంటాను.

MR. SPEAKER:—We may arrange it according to our own convenience. It is already supported by another member. So, the motion is already before the House and for speeches, I will allow them in some order, so that I may give opportunity to both sides.

Sri P. Sundarayya :—అధ్యక్షా, గవర్నరుగారి భాషణమీద అభినందనలు తెలియజేస్తూయిచ్చిన తీర్మానం నేను బలపరచ జాలనందుకు విచారిస్తున్నాను. ఈ భాషణలో తెలియచేసిన అనేక విషయాలలో నేను ఏకీభవించలేక పోతున్నాను. ప్రభుత్వం యొక్క కొన్ని కార్యకలాపాలు ప్రజలకు వ్యతిరేకముగా వుండడమువల్ల వాటిని గురించి నా సంతోషాన్ని వెలిబుచ్చుతూ అభినందించజాలక పోయినందుకు నాయొక్క విచారము తెలియపరచుకోవలసి వున్నది. ఆంధ్ర ప్రజలందరు కోరుతున్న విశాలాంధ్రను సాధించటానికి ప్రభుత్వం ఏమి చర్యతీసుకున్నదిన్నీ, ఏమిచర్యతీసుకోబోతున్నదిన్నీ, రాష్ట్ర పునర్నిర్మాణ సంఘము ముందు ప్రభుత్వముయొక్క దృక్పధాన్ని ఏ విధంగా తెలియజేసిందిన్నీ గవర్నరుగారి భాషణలో కనపడలేదు. ఇది సహజమే ననుకుంటాను, ఇదంతా చూస్తే ఏ విధంగావున్నదంటే, పవతితల్లి ప్రేమలాగా, విశాలాంధ్ర ఎవరన్నా తెచ్చిపెట్టడం, ఎవరన్నా తెచ్చియిస్తే రానీ, లేకపోతేపోనీ, అనే ధోరణి యీ ప్రభుత్వం అవలంభిస్తున్నదా, ఏమి? అనే అనుమానం ఆంధ్రప్రజలకు కలగడం సహజం. ఈ మధ్య ఉప ముఖ్య మంత్రి శ్రీనీలం సంజీవ రెడ్డిగారు ఆంధ్రరాష్ట్రానికి రాజధానిగావున్న కర్నూలులో వుపన్యాసము చేస్తూ, మనకు విశాలాంధ్ర వచ్చేవరకూ కూడా కర్నూలులోనే రాజధాని వుండాలి అని ప్రకటించారు. దాన్నిగురించి మాకు ఏవిధమైన అభ్యంతరముగూడ లేదు. కాని ఉప ముఖ్యమంత్రిగారు అనేక సందర్భాలలో విశాలాంధ్రను చాలా త్వరగా సాధించగలమనిన్నీ, త్వరలోనే రాబోతున్నదని ఉపన్యాసాలుచేశారు. అలాంటి సందర్భములో విశాలాంధ్ర ఎంత త్వరలో వస్తుంది, వచ్చేదానికి ప్రభుత్వం ఏవిధంగా ఏమేమి చర్యలు తీసుకుంటున్నది, అనే విషయాలను గూర్చి ఏవిధమైన ప్రస్తావన గూడా గవర్నరుగారి ప్రసంగములో లేకపోవడము వల్ల, నిజంగా విశాలాంధ్ర కొరకు ప్రభుత్వం చర్యలు తీసుకుంటున్నదా అని అనుమానపడవలసి వస్తున్నది. ఈ విషయములో వారు అనేక రకాల తిరోద్యమాలు, వార్తలు వస్తున్నవి, హైదరాబాదు స్టేటును వివిధ భాషా ప్రాంతాలుగా విభజించినా తెలుగుభాషా ప్రాంతంగావున్న తెలంగాణ ప్రాంతాన్ని వేరే రాష్ట్రంగా విభజించాలనేటట్లుగాను అందుకొరకు విశ్వప్రయత్నాలు జరుగుతున్నవనన్ని ఒక ప్రక్కన వార్తలవల్ల తెలుస్తున్నది. ఫజల్ అలీ కమిషన్ ఎటువంటి రిపోర్టు యివ్వబోతున్నదో గాని, దాని విషయములో అనేక అనుమానాలు వస్తున్నవి. ఈ విషయములో పరిస్థితి ఏమిటో

(Sri P. Sundarayya) [25th April, 1955

ప్రభుత్వము ఏమి చర్యలు తీసుకుంటున్నదో తెలియలేదు. కనీసము అటువంటి కోర్కె అయినా ఆంధ్ర ప్రజలు, తెలంగాణా ప్రజలుకోరితేనే. మనము విశాలాంధ్రను సాధించగలము, కనుక ఆంధ్ర ప్రజలు కోరిన ప్రకారము విశాలాంధ్ర ఏర్పడాలనేది అంగీకరిస్తున్నామని గవర్నరుగారి భాషణలో లేకపోవడము చాలా విచారకరము. ఆంధ్ర ప్రజానీకంలో అత్యధికంగా నూటికి 96 మంది తెనుగు భాష మాట్లాడేవారు ఉన్నారు. ప్రభుత్వ వ్యవహారకాండ అంతయు తెనుగు భాషలోనే జరగవలసివుంటుంది. అదేరకంగా మన విశ్వవిద్యాలయాలలో గూడా విద్యా బోధన అంతాగూడా తెనుగుభాషలోనే జరగవలసివున్నది ఆవిధంగా జరిగినప్పుడే ఆంధ్ర ప్రజలందరు రాజకీయాలలోను, ప్రభుత్వ వ్యవహారలలోను మరింత సన్నిహితంగా పాల్గొనటానికిన్నీ తమయొక్క కష్టనిష్ఠూరాలు పోగొట్టుకొనే దానికిన్నీ, వీలవుతుందని మనవిచేస్తున్నాను. అమరజీవి పొట్టి శ్రీరాములుగారి ఆత్మార్పణముతో మనము ఆంధ్ర రాష్ట్రము సాధించుకోగలగడము జరిగింది. ఇప్పటికి ఆంధ్రరాష్ట్రం ఏర్పడి దరిదాపు 18 మాసాలు అయినప్పటికి కూడా, నేటివరకూ ప్రభుత్వ వ్యవహారకాండ తెనుగు భాషలోనే నిర్వహింపబడుటకు ఏలాటి ప్రయత్నం జరుగలేదు. అందుకు తగిన కర్మకాండను వెంటనే సాగించుకోవడానికి తగిన కార్యకలాపాలు ప్రభుత్వము తీసుకోవాలి, దీని ప్రస్తావన గవర్నరు భాషణలో ఉదహరింపబడక పోవడం శోచనీయంగావున్నది. ప్రభుత్వ వ్యవహారకాండ ఆంధ్రభాషలో జరపలేము అనుకోవడం చాలా పొరబాటు. ఇది జరిగితీరాలి అని అంటున్నాను. ఇప్పటికి బీహారు, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్ మొదలైన రాష్ట్రాలలో అక్కడి ప్రజల భాషఅయిన హిందీలోనే వారి ప్రభుత్వ వ్యవహారకాండను జరుపుకోటానికి నిశ్చయించుకున్నారు. ఇదిగూడా వారు యిదివరకెన్నడో నిశ్చయించుకున్నారు. అందుకుగాను తగిన చర్యలుకూడా తీసుకున్నారు. కాని ఆంధ్రులమైన మనము ఎంతోకాలంగా ఆందోళనజరిపి సాధించుకున్న ప్రత్యేక భాషా రాష్ట్రమైన మన ఆంధ్రరాష్ట్రములో అటువంటి ప్రాతిపదిక లేకపోవడము చాలా విచారకరంగా యున్నది. కనుక మన ఆంధ్రశాసనసభా కార్యక్రమము తెనుగు భాషలో జరుపుకొనుటకున్నూ శాసన సభ్యులు తెనుగులోనే మాట్లాడటానికిన్నీ అవకాశము ఉండాలి. దీనిని ఎవరుగూడా కాదనలేరు. రాజ్యాంగ చట్టము మనకు యిచ్చిన స్వేచ్ఛనుబట్టి ప్రభుత్వ వ్యవహారములు, మన శాసన సభాకార్యక్రమము మన తెనుగు భాషలోనే యింతవరకు ఆరంభింపబడక పోవడమునకు మనము చాలా విచారించవలసి వుంటున్నది. అందుకు మనము సిగ్గుతో తలవంచుకోవాలని అంటున్నాను.

మరొక విషయము చెప్పగలను. మనకు ఆంధ్రరాష్ట్రము వచ్చి యిప్పటికి 18 మాసములయినప్పటికిని, నేటివరకు ప్రభుత్వ ఆఫీసులు యింకను మద్రాసులోనే ఉంటున్నవి. ఆఫీసులు అక్కడ వుండడమువల్ల ఆంధ్రఉద్యోగులు అనేక యిబ్బందులకు గురి అవుతున్నారు. ఆ ఆఫీసులను అక్కడినుంచి తరలించి మన రాష్ట్రములో ఏ జిల్లాలోనైనా అనువైన చోట్లలో పెట్టినట్లయితే ఆంధ్ర ఉద్యోగస్థులకు ఎంతో వీలుగావుంటుంది. వాటిని గురించి ఏదో పత్రికలలో వార్తలు ప్రచురింపబడడము తప్ప, ప్రభుత్వము ఎలాంటి చర్య తీసుకొన దలచిందిన్నీ తెలియడములేదు. పోనీ గవర్నరు భాషణలోనైనా ప్రసక్తి కనబడలేదు. ఈ ఆఫీసులు మద్రాసులోవుండడము వల్ల ప్రభుత్వము ఆర్థికంగా నష్టపడుతున్నదన్న సంగతి చెప్పనవసరము

లేదు. నిజంగా యింత ముఖ్యమైన విషయము గవర్నరు భాషణలో వుదహరించబడక పోవడము పెద్దలోపమని చెప్పవలసి వస్తున్నది.

మరొక విషయము చెప్పదలచాను. నేటివరకూ ప్రభుత్వ వ్యవహారకాండలో పోలీసులను ఉపయోగించడము కనబడుతున్నది. మామూలు గౌరవ కలాపాలలో గూడా ప్రభుత్వానికి యీ పోలీసు పటాటోపము ఎందుకో, దీని అవసరము ఏమిటో తెలియకున్నది. నేటికి గూడా యీ పోలీసు మనోప్రవృత్తి ఏరీతిగావుంది అని తెలుసుకోటానికి నేను ఒక చిన్న వుదాహరణ మీముందు తీసుకురాదలచాను. మొన్నటిదినం యిక్కడ గవర్నరుగారు వారి భాషణ కొరకు వారిని ఆహ్వానించిన సమయములో,—అది గవర్నరుగారి వూరేగింపు అనండి, మరేమైనా అనండి — ఆ వూరేగింపులో గవర్నరు బంగళానుంచి యీ శాసనసభకు వచ్చే దారి పొడుగున సాయుధపోలీసులు పహరాచేస్తూ, ప్రజలెవరు ఆ దారిన నడవకూడదు, నడిచేటట్లయితే, పోలీసులకు వెనుక ప్రక్కన రాళ్లతోనిండివున్న, అపరిశుభ్రముగా వున్న ప్రాంతాననే నడవవలసి యుంటుందని చెప్పారు. కానీ, పోలీసుల ప్రక్కనే ఉన్న దారిననే ప్రజలు నడుస్తుంటే, అలా వీలులేదని ఆజ్ఞాపిస్తు ఆఖరువరకు ప్రజలను నిర్బంధముచేసి, వారిని చివరివరకు అటకాయించడము జరిగింది. పోలీసులు గవర్నరు అభిమానాన్ని చూరగొనటానికి యిది ఒక మార్గంగా కనబడుతున్నదేగాని, వేరొకటి కాదన్నట్లు కనబడ్డది. గౌరవకార్యకలాపానికి యింత పటాటోపము ఎందుకో అర్థము కావడము లేదు. ఇంతేకాకుండా యీ ప్రజలలో శాసనసభ్యుడనైన నేను కూడా వున్నందుచేత, నేను కూడా అగౌరవం పొందవలసి వచ్చింది. చాలా అవమానము కూడా జరిగింది, అయితే శాసనసభ్యులకే యిటువంటి అగౌరవము జరుగుతూవుంటే, యిక సామాన్య ప్రజానీకానికి అటువంటి సమయాలలో ఎటువంటి అమర్యాద జరుగుతుందో మీరే వూహించవచ్చు. అందుకోసము యీ పోలీసు పటాటోపము, ఎంతత్వరగా ముగిస్తే అంతమంచిది. ఇదంతాచూస్తే ఒక పెళ్లికుమారుని పెళ్లికిరమ్మని ఆహ్వానించి, వచ్చిన తరువాత అతిథుల నందరిని బంట్రోతులచేత ఎందుకువచ్చారు అని దారిపొడుగునా తిట్టిస్తే ఎంత చక్కగా వుంటుందో, గవర్నరుగారి భాషణకోసము వారిని యిక్కడికి ఆహ్వానించినప్పుడు, అతిథులైన ప్రజలు యీ అగౌరవము సంపాదించుకోవడం ఆమాదిరిగా వుందని తమకు విజ్ఞప్తి చేస్తున్నాము.

అంతేకాదు గవర్నరుగారు ఏ ప్రాంతానికి వెళ్లినమా మంత్రులుగూడా పోలీసు పటాటోపంతో ఎందుకు వెళ్లవలెనో అర్థముకాకున్నది. ఈ పటాటోపము అంతా చూస్తే, ఏదో పూర్వకాలపు రోజులలో జరిగినట్లు యిప్పుడుగూడా జరుగుతున్నట్లు కనబడుతున్నది. కాంగ్రెసు నాయకులు కానివ్వండి, మరే యితర పార్టీనాయకులు కానివ్వండి, మనకు స్వాతంత్ర్యము వచ్చిన తరువాత యీ పోలీసు పటాటోపము ఏమాత్రము అవసరం లేదని అంటున్నాము. ఈ విషయములో వేరొకటి మనవి చేయదలచాను. ఈ నాయకులు ప్రజల అభిమానం చూరగొనినంత కాలము, ఎవరూకూడా యీ పోలీసుల సహాయము కోరడము అవసరము లేదని అంటున్నాము. అందువల్ల యిటువంటి గౌరవకార్యకలాపాల సమయములలో, ప్రజాస్వామిక ప్రభుత్వం అభివృద్ధి చెందుతున్నప్పుడు, పోలీసు పటాటోపము ఎందుకు అవసరమైనదో ఆలోచించవలసి వున్నది. ఇకముందైనా, యీపోలీసు పటాటోపము తగ్గించవలసి వుంటుందని చెప్తున్నాము.

(Sri P. Sundarayya) [25th April, 1955

గవర్నరుగారు ఎన్నికలు సక్రమంగా జరిగినందుకు వారిసంతోషాన్ని వెలిబుచ్చారు. రాజేశ్వరరావుగారు ఎన్నికలలో వారిపార్టీ సాధించిన విజయాన్ని ప్రజాస్వామిక విజయం అని వర్ణించారు. వారు అవిధంగా వర్ణించడం వారి కర్తవ్యం, ఆ కర్తవ్యాన్ని వారు నిర్వహించారు. బాగానేవుంది. కాని అసలు ఎన్నికలు స్వేచ్ఛగా జరిగినవా అంటే జరగలేదు. ప్రతి గ్రామంలోని భూస్వాములు, డబ్బు బాగా వున్నటువంటివాళ్లు ఎన్నోరకాలుగా ఓట్లు కొనితెచ్చుకున్న వుదాహరణలు వేలకొలది యివ్వవచ్చును ఎన్నికలలో గెల్చినది కాంగ్రెసు పార్టీకాదని ఎవరన్నారు? కనబడుతూనే వున్నది. సభలో దాదాపు మూడువంతులు పైగా కూర్చున్నపుడు గెలవలేదని ఎవరన్నారు? ఎందుకని గెలిచారు, ఏరకంగా గెలిచారు అనేది మేము చర్చించదలచుకోలేదు, కాని గవర్నరుగారి ప్రసంగంలో ఎన్నికలు శాంతంగా, నిష్పక్షపాతంగా స్వేచ్ఛగా జరిగిపోయినవని చెప్పుకొన్నదానికి మేము ఏమాత్రం అంగీకరించడంలేదు. ఓటర్లుకు స్వేచ్ఛగా ఓటుచేసే హక్కులేకుండా, భూస్వాములు, డబ్బువున్నటువంటివాళ్లు ఒత్తిడిచేసి బస్సులలో, లారీలలో ఓటర్లను చేరవేస్తున్నారని చెప్పినప్పటికీ ప్రభుత్వ యంత్రం చర్యతీసుకోకుండా వూరుకుంది. తరువాత బాలెటు నంబర్లు ఓటరుపేరు ప్రక్కన వ్రాసుకోవడంవల్ల తరువాత ఎవరు ఎవరికి ఓటుచేశారో తెలిసిపోతుందనే బెదరింపుల ప్రచారంవల్ల ఎన్నికలు స్వేచ్ఛగా జరిగినవని మేము అనుకోడం లేదు. అంతేకాదు, ఈ రోజు యీ విషయాన్నిగురించి సవరణ యివ్వడంలో వాటినన్నింటినీ చెప్పడంకూడా మా ఉద్దేశంకాదు. అదిఅంతా "గత జలసేతు బంధనం" చేసినదేదో చేశారు. కాని తమకు ప్రతికూలంగా ఓటుచేశారని భూస్వాములు, పెత్తందార్లు నేటికికూడా ప్రజానీకాన్ని బెదిరించి, హింసపెడుతుంటే ప్రభుత్వం ఎట్టి శ్రద్ధచూపుటలేదు. ఈ నిర్బంధ విధానం ఎందుకు ఆచరణలో పెడుతున్నారని అడుగుతున్నాను. ఈ రోజుకుకూడా వందలాది గ్రామాలలో తమకు వ్యతిరేకంగా ఓటుచేసిన వారిని పొలాలలోనికి రాకుండా అడ్డుపెట్టడం ఎందుకు చేస్తున్నారు. ఉదాహరణలు చాలావున్నాయి. ఉదాహరణలకు ఇది సమయంకాదు. అందుచేత వివరాలకు వెళ్లదలచుకోలేదు. గత 8 ఏండ్లుగా కాంగ్రెస్‌పార్టీ అధికారంలోవున్నది. మరొక 5 ఏండ్లపాటు అధికారంలో ఖచ్చితంగా వుంటుందని అనుకుంటున్నాను. ఐనప్పుడు వారు అవలంబించే విధానాలు ప్రజలకు ఎంత న్యాయంగా ఉన్నాయనే విషయం గమనార్హం. గత 8 ఏండ్లలోను ప్రజల అభివృద్ధికి తగు మార్పులు తీసుకురావడానికి ఏ చర్యలు ప్రభుత్వం తీసుకుంది అని అడుగుతున్నాను. గత ప్రభుత్వాలు సాధించిన ఫలితాలు చాలా నిరాశాజనకంగాఉన్నవి. ఇదివరకటి ప్రభుత్వం అన్నిరకాల బంజరుభూములను ఫారెస్టుబంజర్లను, ప్రభుత్వ బంజరులను కూడా ప్రభుత్వాధీనం చేసుకుని భూమిలేని వ్యవసాయదారులకు ఉచితంగా యివ్వాలని చెప్పి ఏకగ్రీవంగా తీర్మానిస్తే, ఆచరణలో ఎన్నో మినహాయింపులు తేవడం జరిగింది. నందికొండ ప్రాజెక్టు కావాలంటే యీ రోజున బంజరుభూములు వేలంవేస్తాం అంటున్నారు. ఇదివరకు ప్రభుత్వంలోవున్న మీ పక్షంవారు ఏకగ్రీవంగా చేసిన తీర్మానాన్ని త్రోసిరాజని ఈ రోజున వెనుకకు పోయేదానికి ఆరంభించారు అని చెప్పవలసివుంటుంది. నందికొండకు డబ్బు కావాలంటే డబ్బున్నవాళ్ళమీద అదనంగా పన్నులువేయండి. పెద్దపెద్ద భూస్వాములమీద పన్నులువేయండి వేలు, లక్షలు తరబడి ఆర్జించే వాళ్ళమీద పన్నువేయండి. సంవత్సరానికి 30 వేలో 20 వేలో వుండి అంతకు మించి ఆదాయం వుండరాదని ceiling నిర్ణయించి అదనపుడబ్బు తీసికొని

25th April, 1955] (Sri P. Sundarayya)

నందికొండ ప్రాజెక్టుకట్టండి. అంతేగాని భూములు లేనటువంటి పేద ప్రజానీకానికి బంజర్లివ్వకుండా వేలంవేసి నందికొండ కడతాం అనడం బీదలనుకొట్టి ధనవంతులకు తిండిపెట్టేరీతిగా వున్నదేగాని ప్రజల మంచికోసం అవలంబించిన కార్యక్రమం కాదని స్పష్టంగా చెప్పాల్సి వుంటుంది.

అంతేకాదు. ఇదివరకు 10 రూపాయలలోపు శిస్తుకట్టే పేద ప్రజానీకానికి మీశిస్తు రద్దుచేస్తాం అనిచెప్పి ప్రభుత్వం తరఫున ప్రకటించారు. దాన్ని ప్రకటించినప్పుడు 1¼ కోట్లు అదనంగా నష్టంవస్తుందని తెలుసు. అయినప్పటికీ పేదప్రజానీకానికి కొంత సౌకర్యం కలుగ చేస్తామని చెప్పి ఆరోజున నిర్ణయం తీసుకొన్నారు. సంవత్సరానికి 1¼ కోట్ల రూపాయలు కావాలంటే ధనవంతులమీద పన్నులు వేసేదానికి ఎందుకోసం పూనుకోరు? ఇంకా అనేక రకాలుగా డబ్బున్నవాళ్ళమీద పన్ను వేస్తే 10 రూపాయలశిస్తు రద్దుచేయవచ్చు. నందికొండ ప్రాజెక్టు నిర్మించుకోవచ్చు. ప్రభుత్వంవారు అభివృద్ధి పన్ను విధించాలని, నీటితీరువ పెంచాలనీ చెప్పారే కాని ప్రజలకుపయోగకరమైన కార్యకలాపాలు ప్రారంభించలేదు. ప్రజలకుపయోగించని విధానం ప్రజాస్వామిక విధానం కాదని నేను వారికి తెలియచేయాల్సివుంటుంది. అభివృద్ధిపన్ను వేసేదానికి ముందు భూములకు నీటిసౌకర్యం కలుగజేస్తే బాగుంటుంది. తరువాత అభివృద్ధిపన్ను వేయవచ్చు.

The Hon. Sri K. Venkata Rao:—వేస్తామని దాంట్లోవున్నదా?

Sri P. Sundarayya.—దాంట్లోవున్నదనే అర్థంచేసుకున్నాము. అభివృద్ధి పన్ను వేస్తాం అన్నారు. చిన్నరైతులను, మామూలు రైతులను మినహాయించి భూస్వాములమీద మాత్రం ఈ పన్ను వేయాలి.

తుంగభద్రా ప్రాజెక్టు పూర్తిఅయింది. నీరు రెండు సంవత్సరాలుగా వదలుతున్నారు. లక్షలాది ఎకరాలభూమి సాగుకావలసిన ప్రాంతములో కొన్నివేల ఎకరాలు మాత్రమే సాగవుతున్నది. ఎందువలన? ఈ ప్రాజెక్టుక్రింద భూస్వాముల దగ్గర వేలకొలది ఎకరాలు వుండడమువల్ల వాటిని సాగుచేయుటకు సాధ్యముకాదు. ఆ భూమిని బీద ప్రజానీకానికి ఎందుకు పంచకూడదు? అటువంటి కార్యకలాపాలకొరకు ఎందుకు ఆలోచించకూడదు? నీటి తీరువ వేస్తామంటున్నారు. నందికొండ ప్రాజెక్టు క్రిందిభూములపైన నీటితీరువ వేయుటకు ఎవరికి అభ్యంతరములేదు. కాని ఇట్టి ఉద్దేశముతో కాదు. ముందుగా నీరుఇచ్చి నీటితీర్వ వేయడము సబబుగావుంటుంది. అందుచేత ప్రజోపకరమైన కార్యములనే పేరుతో బీద ప్రజానీకముమీద, చిన్న రైతాంగముమీద పన్నులు వేసేపద్ధతి తప్ప పెద్దపెద్ద భూస్వాములవద్దనుంచి వారెంత భరించగలరో అంత రాబట్టడానికి తలపెట్టలేదు.

పోగా రైతాంగము పండించే పంటలకుధరలు పడిపోతున్నవి. ముఖ్యముగా వ్యాపార పంటలు వేరుశెనగ, మిర్చి, పొగాకు, ఉల్లిపాయలు మొదలైనవాటి ధరలు పడిపోయినాయి. రైతాంగాన్ని కాపాడటానికి ప్రభుత్వము యేవిధమైన చర్యలు తీసుకొనలేదు. ఆహార

ధాన్యాలకు కొంతవరకు ధరలు పడిపోయినాయి. దీనివల్ల కార్మికులకు, బీదప్రజలకు, చిన్న ఉద్యోగస్థులకు కొంత సహాయము కలిగినా అశేషముగా 100 కి 80 వంతులు వ్యవసాయముమీద ఆధారపడే ప్రజల ఆర్థికస్థితి పూర్తిగ నశింపు అయిందని గుర్తించినపుడు ప్రభుత్వము ఏమి చర్యలు తీసుకొనవలని వుంటుందో వాటినిగురించిన ప్రస్తావన ఉపన్యాసములో లేకపోవుట వాల విచారకరము, ప్రజల అవసరాలను గుర్తించలేదని చెప్పవలని వస్తోంది. ఇంలేకాదు ఈ రోజున వారి పంటలకు ధర పడిపోతున్నందున రైతాంగము నష్టపడుతున్నది. మరొక ప్రక్కన ప్రభుత్వ చిన్నఉద్యోగస్థుల జీతాలు, ధరలు పడిపోయినవనే కారణంతో తగ్గించాలని ప్రభుత్వము ఆలోచించుచున్నది. ఇదివరకు చినచిన్న ఉద్యోగస్థులకు, lower division గుమాస్తాలు మొదలైనవారికి 9 రూపాయలచొప్పున యింటిఅద్దె అలవెన్సుయిస్తూ, యీ రోజున యీ అలవెన్సు మానివేస్తామనడం సబబుకాదు. కర్నూలులో కాపురాలున్న వారికి ఇళ్లు యిచ్చామని 100 కి 10 రూపాయల చొప్పున మినహాయించుతూ వారికి రోజున యీ 9 రూపాయలూ ఇవ్వకపోవడం జరిగింది. అంతేకాదు, అధికధరల అలవెన్సుక్రింద వారికిచ్చే భత్యములో కూడ ⅕ వంతువరకు తగ్గించడానికి Cabinet లో నిర్ణయమైనట్లు తెలియవచ్చింది.

The Hon. Sri K. Venkata Rao:—గజకర్ణవిద్య వున్నట్లుందే. మేము అనుకోకుండనే మీకు వినిపిస్తుంటాయి.

Sri P. Sundarayya:—మీరు అనుకున్నారు కాబట్టే తెలిసింది. గోడలకు చెవులు వుంటాయి. మీరు అలా అనుకోకపోతే చాలసంతోషము.

The Hon. Sri K. Venkata Rao:—అనుకోలేదు.

Sri P. Sundarayya:—తగ్గించరాదని నిర్ణయించినందులకు మా అభివందనాలు.

The Hon Sri B. Gopala Reddi:—పెంచితే జోహార్లుకూడ యిస్తారు.

Sri P. Sundarayya:—మీరు ఎక్కువచేయ ప్రయత్నించాలే గాని అందుకేమీ లోటు వుండదు. వేలకొలది జీతాలు తీసికొనేవాండ్లకు తగ్గించడానికి ఎందుకు ఆలోచించరు? పెద్దపెద్ద భూస్వాములకు వాండ్ల కుటుంబాలకు కావలసిన భూమిని వదలి మిగిలిన భూమిని పంచడానికి ఆలోచించరు. మీకు చిన్న చిన్న ఉద్యోగస్థులు తప్ప మరెవరు కనిపించరు. ఇది సరైన మార్గముకాదని నేను చెప్పుతున్నాను.

పరిశ్రమలలో వున్న కార్మికులకు కనీస వేతనాలు ఇంకా నిర్ణయించలేదు. వ్యవసాయ కూలీలకు కనీస వేతనాలు నిర్ణయించలేదు. 16 వేల గ్రామాలలో 14 గ్రామాలలో మాత్రమే వ్యవసాయ కూలీలకు కనీస వేతనాలు నిర్ణయించామని చెప్పారు. అట్లు చెప్పకొనకుంటేనే గౌరవముగా వుండేది. అది ఎందుకని చెప్పారో మాకు అర్థముకావడము లేదు.

చేనేత పారిశ్రామికులకు, గీత పనివారలకు వృత్తిపోయింది. వారికి వృత్తి కల్పిస్తామని అన్నారు. అది క్రొత్తసంగతి కాదు. ఈ గీత పనివాండ్లకు వృత్తులు కల్పించడం గురించి ఏదో

25th April, 1955] (Sri P. Sundarayya)

ఆలోచిస్తామని అంటూవున్నారు. ఈ సందర్భములో ఒకవిషయం స్పష్టంగా మాపార్టీ తరఫున తెలియజేయాలి. ప్రతి ఒక్కరు త్రాగి తందనాలు ఆడమనికాదు మాపార్టీ ఉద్దేశము.

Sri S. Narayanappa:—అధ్యక్షా, on a point of Order. ఎన్నికలలో గోడల మీద బాగా పెద్దఅక్షరాలతో "కల్లు సారాయి కావాలంటే కమ్యూనిష్టు పార్టీకే ఓటుయివ్వాలి" అని వ్రాసినారు.

MR. SPEAKER:—There is no point of Order.

Sri P. Sundarayya:—ఆ సందర్భములో త్రాగి తందనాలాడమని యే కమ్యూనిస్టు సభ్యుడు చెప్పలేదు. మద్యపానమువల్ల ఆరోగ్యానికి నష్టము కలుగుతుందంటే దానిని తగ్గించమని ప్రచారము చేయాలి, కాని వీరు తీసుకున్న చర్యలు త్రాగుడును తగ్గించడానికి దారితీయవు. ప్రజలలో చైతన్యము తీసుకురావాలి. మా అధికారాన్నంతా వినియోగించినట్లయితే, 7 కాదు ఇంకా 70 జైళ్లుకూడ చాలవు. శాసనాలవల్ల మద్యపాన నిషేధము, అమలు జరుపటము మీతరము కాదు, మాతరము కాదు. మద్యపాన నిషేధము ఆ రీతిగా అమలు జరుపటము సాధ్యముకాదు. ఈ మద్యపాన నిషేధంవల్ల మేముగెలిచాము అని కాంగ్రెస్ నాయకులు అనుకోవచ్చు. కాని దానివల్ల గెలువలేదని మీకుతెలుసు; మాకుతెలుసు.

The Hon'ble Sri K. Venkata Rao:—దేనివల్ల?

Sri P. Sundarayya:—ఇది ఎన్నికల సమీక్షకాదు. దేనివల్ల గెలిచారో మీకుతెలుసు అవలంబించిన విధానాలు తెలుసు. ఈ సందర్భంలో ఆవివరాలన్నీ అవసరంలేదు కాబట్టి వదలు తున్నాము. ప్రచారంచేసి ప్రజల ప్రవృత్తిలో మార్పు తీసుకురావాలి కాని క్రొత్తనేరాన్ని సృష్టిచేసి శిక్షిస్తాము అని చెప్పడంవల్ల ఏమీ లాభంలేదు. ఈ నిర్బంధంవల్ల ఎంతో మందికి పనిలేకుండా చేయడం, కొంతమందికి లంచాలకు దారిచూపడం తప్ప మరొకటికాదు.

కొన్ని ప్రాథమిక పాఠశాలలు తెరిచినట్లు గవర్నరుగారి ప్రసంగంలో వున్నది. ఏప్రభుత్వ మయినా అధికారంలో వున్నపుడు కొన్ని స్కూళ్లు తెరవడం, కొన్ని hospitals తెరవడం జరగక తప్పదు. అట్లాచేసినందుకు గొప్పతనం ఏమీలేదు. 6-14 సంవత్సరాల మధ్యవుండే బాల బాలికలకు 10 సంవత్సరాల్లో ఉచిత విద్యాబోధన చేయించడానికి రాజ్యాంగం నిర్దేశించింది. మరొక ఆరు సంవత్సరాల్లో అందరికి చదువు చెప్పించడానికి కావలసిన ఏర్పాట్లు చేయడానికి మీకార్యక్రమం ఏమిటి? మీప్రణాళిక ఏమిటి? దానిని అమలుచేయడానికి మీరు ఏమిచర్యలు తీసుకున్నారు? క్రొత్తగా 500 స్కూళ్లు తెరచినంతమాత్రం చేత ఏమీ లాభంలేదు. ఈ దృష్టితోచూస్తే ప్రభుత్వ విద్యావిధానం చాలా అసంతృప్తికరంగా వున్నదని చెప్పవలసి యున్నది.

ఉన్నతవిద్య విషయం తీసుకువిచూస్తే, స్థానికంగావచ్చే సహాయం చాలికారణంగా, జిల్లా బోర్డులు కొన్ని హైస్కూళ్లు మూసివేయా లనుకొన్నాయి. దానిమీద కొంత ఆందోళన జరిగిన

(Sri P. Sundarayya) [25th April, 1955

పిమ్మట ఆ నిర్ణయం వాయిదా వేయడం జరిగింది. ఆరు సంవత్సరాలలో జరగవలసిన పని జరగాలంటే ప్రభుత్వం దానధర్మాల మీద ఆధారపడరాదు. వ్యక్తులమీద భారంవేసి ప్రభుత్వం ఆ బాధ్యతను వదులుకొనడం సమంజసంకాదు. ప్రజాప్రభుత్వం అనేది ఆ రీతిగా చేయజాలదు.

వైద్యవిషయం తీసుకుంటే ఆంధ్రరాష్ట్రంలో వైద్యసౌకర్యాలు సక్రమంగా వున్నట్లు, వాని ప్రసక్తి అవసరంలేనట్లు, గవర్నరుగారి ప్రసంగంలో వదలివేసారు. 1,2 ఆసుపత్రులు అదనంగాపెట్టి, వైద్యకళాశాలలను తెరిచినా లాభంలేదు. ఆంధ్ర రాష్ట్రంలోవుండే ప్రతి ఒక్కరికి ఉచితవైద్య సదుపాయం కలుగచేయడానికి, స్త్రీలందరికి కానుపు సమయాలలో తగిన మంత్రసానుల సహాయం కలుగచేయడానికి ఏచర్యలు తీసుకున్నారు? డాక్టర్లు, మంత్రసానులు - అయిదు సంవత్సరాలు శిక్షణ పొందినవారు కాకపోయినా - తాత్కాలికంగా వైద్యసహాయం చేసే వారినైనా ఏర్పాటుచేయడానికి ఏమిచర్యలు తీసుకున్నారు? ఈ ప్రస్తావనే గవర్నరుగారి ప్రసంగంలో లేకపోవడం సరిఅయినది కాదు.

రెండవ పంచవర్ష ప్రణాళిక గురించి చెబుతూ, గ్రామసీమలనుంచి పైవరకు అభివృద్ధి చేయడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయని చెప్పారు. 27 జాతీయవిస్తరణ బ్లాకులలోను పని ఏ విధంగా జరుగుతున్నదీ వెల్లడించలేదు. ప్లానింగ్ కమిషన్‌వారు తమ evaluation report లో ఈ పని చాలా అసంతృప్తికరంగా సాగుతోందని అంగీకరించారు. ఆంధ్రరాష్ట్రం పారిశ్రామికంగా, వ్యవసాయికంగా అభివృద్ధి చెందడానికి ప్రణాళికలో సూచించబడిన పనులు చాలా అసంతృప్తికరంగా వున్నాయి. అయిదు పెద్దఫాక్టరీలు ఏర్పాటుచేస్తామని అన్నారు. అందులో రెండు చక్కెరమిల్లులు, ఒక సిమెంటుమిల్లు, ఒక textile మిల్లు వుండవచ్చును. ఇదేనా పారిశ్రామిక ప్లానింగు? ఆంధ్రలో మైకా బాగాదొరుకుతోంది. ఈ వ్యాపారం చాలా సంక్షోభంలో వున్నది. మన రాష్ట్రంలో లభ్యమయ్యే మైకాను ఉపయోగించేదానికి వీలుగా ఇక్కడ ఒక పెద్దసంస్థను నిర్మించవచ్చును. పరిశ్రమకు కావలసిన విద్యుచ్ఛక్తి తయారుకు సూచనలు ఏమీలేవు. ఆంధ్రరాష్ట్రంలో గోదావరి నదీప్రాంతంలో బొగ్గు దొరుకుతుంది. ఈ విషయమై ప్లానింగు కమీషనువారు పరిశోధనలు జరుపుతున్నారు అన్నారు. కొత్తగూడెం ప్రాంతంలో ఇనుము దొరుకుతుంది. పారిశ్రామికాభివృద్ధికి ఉక్కు చాలా ముఖ్యమైనది కాబట్టి ఈ బొగ్గు, ఇనుము ఉపయోగించి ఒక steel plant నిర్మాణాన్ని మనం కోరవలసియున్నది. ఉక్కు పరిశ్రమ ప్రతిరాష్ట్రం మాకు కావాలంటే మాకు కావాలని పోటీపడుతుంటే, తమిళనాడులో లిగ్నైటువంటి మూడవరకపు బొగ్గును ఉపయోగించి ఉక్కుపరిశ్రమ నిర్మాణానికి ప్రయత్నాలు జరుగుతుంటే, శ్రేష్ఠమైన ఖనిజాలు దొరికే ఆంధ్రరాష్ట్రంలో ఏ ప్రయత్నాలు జరగకపోవడం శోచనీయం. మాంగనీసు, రంగుల్లోనికి పనికివచ్చే అనేక ఖనిజాలు మనకు దొరుకుతున్నాయి. అమ్మ అయినా అడిగితేకాని అన్నంపెట్టదు. కేంద్ర ప్రభుత్వదృష్టి మనవైపు పారేట్లాచేసి, పారిశ్రామికాభివృద్ధికి ప్రభుత్వమువారు పూనుకొంటారని ఆశిస్తున్నాను.

అదేరీతిగా ఆంధ్రరాష్ట్రములో సిగరెట్లు, సబ్బులు, చెప్పుల పరిశ్రమకు కావలసినంత అవకాశమున్నది. పారిశ్రామికాభివృద్ధిని ఇంకా ఎక్కువ చేయడానికిగాను వీటన్నింటిని Plan లో తీసుకొని అభివృద్ధి చేయవలసియున్నది.

25th April, 1955] (Sri P. Sundarayya)

రవాణా సౌకర్యాలను గురించి ఆలోచించినప్పుడు, ప్రభుత్వము దీనివిషయమై ఆలోచించడం లేదా అంటే, ఆలోచిస్తూయున్నది. కాని, ఎటువంటి రైల్వేలైన్లు, ఎటువంటి రోడ్లు, ఎక్కడెక్కడ ఉండవలెననేది ముఖ్యమైన విషయము. ఆంధ్రప్రభుత్వము కొన్ని రైల్వేలైన్లు కేంద్రప్రభుత్వమునకు recommend చేసింది. నెల్లూరునుంచి నంద్యాలవరకు, కడపనుంచి మైదుకూరు వరకు రైలుమార్గాలు సూచించారు అని ఉన్నది. అవి చాలవు. వాటితోపాటు, కడపనుంచి మదనపల్లి, బెంగుళూరువరకు, మైదుకూరునుంచి కనిగిరి మీదుగా దొనకొండ, మాచెర్ల హైదరబాదువరకు రైలుమార్గాలు అవసరము. విశాలాంధ్ర ఎప్పటికైనా వచ్చితీరుతుంది, వస్తుంది. దానికి కేంద్రమైన హైదరాబాదుకు ఆంధ్రదేశము నలుమూలలనుంచి రవాణాసౌకర్యాలు చేయవలసియున్నది. కనుక ఈ మార్గాలను తప్పకుండా రెండవ పంచవర్షప్రణాళికలో చేర్చుటకు మీరు కృషిచేయాలి. ఢిల్లీలో విచారించగా తెలిసింది. బెజవాడ మద్రాసు మధ్యన ఉన్నటువంటి వొత్తిడిని తగ్గించడానికి ఖాజీపేటనుంచి మాచెర్లమీదుగా గూడూరువరకు రైలుమార్గాలువేస్తే సమస్య తేలిపోతుందని కొందరు ఇంజనీర్లు సలహాలు ఇచ్చినట్లు చెప్పారు. దాన్నిగురించి ఢిల్లీ ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లున్నది. ఆమార్గాలు వేయడానికి పెద్దఅభ్యంతరం ఏమీ లేదుకాని, దానితోపాటు, నల్లగొండ, హైదరాబాదు ఆ మధ్య ప్రాంతాలను గూడ కలుపుకోనేది మరచిపోకూడదని మనవిచేస్తున్నాను. అదేరీతిగా విశాఖపట్నంనుంచి వరంగల్లువరకు ఒక రైలుమార్గం వేయాలనే ఆలోచన చాలాకాలమునుంచి ఉన్నది. అయితే అమార్గము వేయడానికి ఎప్పుడు సాధ్యమవుతుందంటే, విశాలాంధ్ర వచ్చినా రాకపోయినా, అక్కడ ఒక ఉక్కు పరిశ్రమను మనము స్థాపించగలిగినప్పుడే ఆ రైలుమార్గంయొక్క అవసరం, ప్రయోజనం ఏర్పడుతుంది. అప్పుడే అదివేయడానికి సాధ్యము. అంతేగాని ఈ నాడు జనాభాబట్టి ఆ మార్గము వేసినట్లయితే ఆ కొండప్రదేశాలకు ఎవరువెళ్ళరు, దానిని ఎవరు అంగీకరించరు. ఆ మార్గమువేయడం అక్కడి ఉన్న ఉక్కు పరిశ్రమ మీదనే ఆధారపడి యున్నది అట్లాగే విజయవాడనుంచి, మద్రాసువరకు జనసమర్థం, అనేక రకాలుగా రవాణా ఉన్నది కాబట్టి double lines వేయాలి. కొత్త మార్గాలతోపాటు, అవసరమైనచోట్ల double lines కూడ వేయాలి. ఇప్పుడు ఢిల్లీప్రభుత్వము double lines వేయకుండా, కొత్తమార్గాలకు మాత్రం ఏర్పాటు చేశారు. అదీ, ఇదీ రెండు కావాలని అంటున్నాము. అప్పుడే విజయవాడయొక్క అభివృద్ధికి దోహద మిచ్చినట్లవుతుంది.

Minor irrigation schemes విషయంలో; వర్షపాతము లేనటువంటి ప్రాంతాలలో minor irrigation projects కుగాను పదికోట్ల రూపాయలు మాత్రమే పంచవర్ష ప్రణాళికలో కేటాయించమని కోరుతున్నట్లు ఉన్నది. ఇది చాలాస్వల్పము. ఇది ఏమూలకూ సరిపోదు అని చెప్పుతున్నాను. వర్షపాతము లేనటువంటి ప్రాంతాలలో చిన్నచిన్న minor irrigation projects తీసుకోవలసి యున్నది. దానికి, కేవలం పదికోట్లు ఎందుకూ చాలదు. ఆ మొత్తాన్ని ఎక్కువచేయడానికి ప్రభుత్వం పాటుపడవలసి యున్నది.

పంటలు బాగా పండుతున్న ప్రాంతాల్లో వరదముంపుదువల్ల పంటలుచాలానష్టమై పోతున్నాయి. కనుక ముంపునివారణ స్కీములు చాలా అవసరం. కాని, దీని ప్రసక్తి గవర్నరుగారి ఉపన్యాసంలో లేకపోవడం చాలావిచారకరంగా యున్నది. ఇది ఒక లోపమని నేను అనుకొంటున్నాను.

ఆఖరికి స్థానిక పరిపాలన విషయంలో, జిల్లాబోర్డు ఎన్నికలను వాయిదావేస్తూ, దాన్ని గురించి త్వరగా నిర్ణయం తీసుకోకుండా ఉన్నారు. జిల్లాబోర్డులను తిరిగి స్థాపించడం అనవసర మనుకొంటాను. ఏరీతిగా రాష్ట్రం మొత్తానికి సంబంధించిన వ్యవహారాలను శాసనసభ్యులు చేస్తూ ఉంటారో జిల్లాకు సంబంధించిన విషయాలు, ఆజిల్లాలోని ప్రజలచే ఎన్నుకోబడిన వారు చూడ వలసి యుండుట సమంజసము. కేవలం పంచాయితీబోర్డులు ఏమి చేయజాలవు ఈ పంచాయితీ బోర్డులు ఇప్పుడున్నరీతిగా ఉంటే సరిపోదు. ఇవి కేవలం మాట్లాడేటటువంటి బోర్డులక్రింద తయారవుతున్నవి. వాటికి ఏలాటి అధికారాలు లేవు. వాటిపైన Executive Officers ఉంటారు. సభ్యులు మాత్రం వట్టిమాటలు మాట్లాడుకొంటూ కేకలువేయవలసిందే తప్ప మరేమి చేయలేరు. వీరికేమి powers లేవు. కనుక వీటిని గురించి ప్రభుత్వము చర్య తీసుకోవాలి.

అందున, గవర్నరు పరిపాలన ఎట్లున్నప్పటికీ, ఈ రోజు అత్యధికసంఖ్యతో కాంగ్రెసు పార్టీ ఉన్నప్పటికీ, ఆంధ్రప్రజల అభివృద్ధికోసం మేము కొన్నిసూచనలు చేశాము. అవి కమ్యూ నిస్టు పార్టీతరఫున చేశాము. కమ్యూనిస్టుపార్టీ చేసిందిగదా అని, మంచివి చెప్పినప్పటికినీ వాటిని మీరు నిరాకరించిన యెడల, దానివల్ల మీకే నష్టము సంభవిస్తుంది. అధికారంనుంచి దిగి పోవలసి యుంటుంది. ఈ సందర్భంలో మరొక విజ్ఞప్తి చేస్తున్నాను. గ్రామాలలో ఎక్కడ ఏ చిన్న తగాదావచ్చినా, కాంగ్రెస్‌కు, కమ్యూనిస్టులకు తగాదా వచ్చినట్లు చెప్పడం జరుగుతున్నది. ఆతగాదాలు విచారించేటప్పుడు, "మిమ్ము కమ్యూనిస్టులు కొట్టారా, కమ్యూనిస్టులు దొంగతనం చేయమన్నారా" అని అవిధంగా పరిశోధనలు జరుగుతాయి. అటువంటి విధానం ప్రజాభిప్రా యానికి ఏమాత్రం దారితీయదని వారికి మనవిచేస్తున్నాను. ఈ మధ్యన ప్రభుత్వానికి ఒకవిషయం గుర్తుకు తెచ్చారట. ప్రతిజిల్లాలో కొన్నిగ్రామాలు కమ్యూనిస్టులయొక్క కంచుకోటలు అయి పోయినాయని, అక్కడకు ఎవరిని రానివ్వడంలేదని, ప్రభుత్వపు ఆర్డర్లు అక్కడ ఏమాత్రం సాగడంలేదని, ప్రభుత్వము ఉన్నట్లే అక్కడ తెలియదని చెప్పారట. గుంటూరుకు 3, 4 మైళ్లలో ఉన్నటువంటి గ్రామాలలోను, తరువాత తెనాలికి 2, 3 మైళ్లలో ఉన్నటువంటి గ్రామాలలోను, ప్రభుత్వము ఉన్నదనిగాని, ప్రభుత్వోద్యోగస్తులు ఉన్నారనిగాని తెలియదట. అవి కమ్యూనిస్టుల కంచుకోటలుగా ఉన్నవట. దానిమీద ప్రభుత్వము ఒక circular కూడ issue చేసినట్లు తెలిసింది. అది ఎలెక్షన్సు అయిన తరువాతనే. ఈ గ్రామాలలో తాశీల్దారు మొదలుకొని అందరు ఉద్యోగస్తులు ఎప్పుడూ వరోజులు క్యాంపుచేసి ప్రభుత్వము ఉన్నదని వారికి నచ్చచెప్ప వలసిందిగా అందులో చెప్పారట. ఈ విధంగా ఎవరో రిపోర్టులు పంపించారని వాటిని విచా రించకుండా ప్రభుత్వము అవితముగా భావించి చర్య తీసుకోవడం సరియైనది కాదు. ఈ రకంగా ఒక వాతావరణాన్ని తయారుచేసి కమ్యూనిస్టులలో ఒక అశాంతిని కల్పించ డానికి పూనుకోవడమే తప్ప మరేమికాదు. మీరు అటువంటి వాతావరణాన్ని తయారుచేసి ఆంధ్రదేశమును అల్లకల్లోలం చేసేందుకు పూనుకుంటే, ఆ బాధ్యత మీదేనని చెప్పుచున్నాను. ఆంధ్రప్రజలను అభివృద్ధిపరచడానికి మీకు మరొక అవకాశంచిక్కింది. దానిని సక్రమంగా

వినియోగించుకొని చేస్తారా, మంచిదే, లేకపోతే అధికారము మీచేతులలో ఉన్నదనిచెప్పి, ప్రజాభిప్రాయానికి వ్యతిరేకంగా, ఏ కొద్దిమంది లాభాలకోసమో దాన్ని వినియోగించుకొంటే ఈ రోజున మీకువచ్చిన విజయమునకు మరెన్నోరెట్లు పరాజయం సంభవిస్తుందని చెప్పుచున్నాను. ఎప్పటికిని, ఆంధ్రప్రజల అభివృద్ధికొరకు, విశాలాంధ్ర స్థాపనకొరకు, అందరు కృషిచేయవలసియున్నది. ప్రభుత్వం ఇందుకు ప్రత్యేకంగా శ్రద్ధ వహించవలెను. ఒక్క విషయం మాత్రం జ్ఞాపకం పెట్టుకోవలసిందని మనవి. ఆంధ్రప్రజలయొక్క అభివృద్ధికిగాను చేసే ప్రతిపనినికూడా కమ్యూనిస్టుపార్టీ బలపరుస్తుంది. దానికి వ్యతిరేకంగాచేసే దానిని, నిర్మొగమాటంగా విమర్శించుటకు వెనుదీయదు. ఈ విషయములు ప్రభుత్వదృష్టికి తెస్తూ, అధ్యక్షా, మీరు ఎంతో ఓపికతో ఇంతకాలాన్ని నాకు ఇచ్చినందుకు మీకు నమస్కారములు తెలియజేస్తూ విరమిస్తున్నాను.

* Sri Addepalli Satyanarayana Murthi.— అధ్యక్షా, శ్రీ పుచ్చలపల్లి సుందరయ్యగారు elections శాంతియుతంగా జరుపబడినవని చెప్పారు. ఇందుకు నేను ఒకటే సమాధానం చెప్పదలచాను. ఆయన ఏవేవో కారణాలు చెప్పారుగాని elections ఆ విధంగా జరగలేదు. అవి అందరికితెలుసు. వాస్తవంగా మన గవర్నమెంటువారు freedom అపరిమితంగా యిచ్చారు. ప్రపంచములో ఏగవర్నమెంటుగూడా యీ విధమైన స్వేచ్ఛ యివ్వలేదని మనవిచేస్తాను. మన కమ్యూనిస్టు సోదరులు వ్యక్తిగతంగా యిళ్లదగ్గరకువచ్చి, అనినబూతుమాటలు, చేసిన హంగామా అంతా సహించరానివిగావున్నవి. హత్యలుచేస్తామని, యింకా ఏవేవో చేస్తామని ఓటర్లను, కాంగ్రెసు అభ్యర్థులను ఏవిధంగా బెదరించారో యీసభలో కూర్చునివున్న కమ్యూనిస్టు సోదరులకు, వారిలో వారికేతెలుసు. Elections అయిన తరువాత నేను మా constituency లో ప్రతి గ్రామమునకు వెళ్ళాను. Elections కు ముందు మన communist సోదరులు చేసిన వుపన్యాసాలలో వారు ఏమిచెప్పిందిన్నీ వారికేతెలుసు. Elections అయిన పదిరోజులువరకు గూడా, ముఖ్యంగా మా constituency లో కమ్యూనిస్టు సభ్యులుచేసిన నినాదాలు యింతయని చెప్పనలవికాదు. Elections లో కాంగ్రెసు వారికి, ఓటుచేసిన వారికిన్నీ, అందులోని నాయకులకున్నూ, పదియవతారీఖున బుద్ధిచెబుతాము అని చెప్పారు. పదియవ తారీఖుఅంటే సభవారికి అర్థంకాకపోవచ్చు. ఆ తేదీన వారు మీటింగు పెట్టుకున్నారు. ఆ రోజున అల్లర్లు సాగిస్తారనే వదంతులు బయలుదేరినవి. ఈ విధంగా కొంతమందికి వుత్తరాలుగూడా వచ్చాయి. నాకుగూడ వుత్తరమువచ్చింది. అందులో "నీవంటి కాంగ్రెసువాణ్ణి మేము వుంచము, జాగ్రత్త" అని వ్రాశారు. ఆ వుత్తరం నాకువంపారు. అది నాదగ్గరవున్నది. ఇదంతా కమ్యూనిస్టులు చేసినఅల్లరి. Elections శాంతియుతంగా జరిగినవని అంటున్నారు. అవి సక్రమంగా నిష్పాక్షికంగానే జరిగినవి. Election ప్రచారములో వారు ఆ విధంగా అల్లర్లు, బెదిరింపులు సాగించినప్పటికిని ప్రభుత్వము వారిమీద చర్య తీసుకోకుండానే elections జరిపారు. కమ్యూనిస్టులు ఎంతటి దౌర్జన్యము చేసినప్పటికినీ, కాంగ్రెసు అభ్యర్థులకే అఖండ విజయంకలిగింది. ఇందులో ప్రజలు ఎవరికి బుద్ధిచెప్పిందిన్నీ రుజువయింది. అందువల్ల కమ్యూనిస్టులకు కలిగిన అవమానంవల్ల వారు ఆ విధంగా చెబుతున్నారేగాని మరేమికాదు. అంతే కాని elections శాంతియుతంగా జరిపారు అనడం అన్యాయమని అంటాను.

(Sri Addepalli Satyanarayana Murthi) [25th April, 1955

గవర్నరుగారి ప్రసంగములో నందికొండ ప్రాజెక్టుకుగాను యింకా మన ఆంధ్రదేశానికి ఎన్నో ప్రాజెక్టులకుగాను అనేక కోట్లరూపాయలు ఖర్చు పెట్టబోతున్నామని చెప్పారు. అందుకు తగిన స్కీములుగుడా తయారైనవి. పని ప్రారంభించబోతున్నామని గూడా చెప్పారు. ప్రాజెక్టు విషయములో యింకా కోరమనీ యిప్పటికి ప్రభుత్వము చేసింది సంలేదని అంటున్నారు. ఇంకను మన ప్రత్యర్థులు చెప్పినమాటలుచూస్తే, ఏదో చంటిపిల్లవాడు పుట్టినవెంటనే, వాడు భోజనము చేశాడో లేదో, లేకపోతే వ్రాశాడోలేదో, యీ ఎసెంబ్లీలో కూర్చున్నాడోలేదో అన్నట్లుగా, వారు చెప్పేది వారు బాగా ఆలోచిస్తే వారికే తెలుస్తుంది ఏ విషయానికైనా కాలపరిమితి కావాలి. అంతా ఒకేసారి మ్రింగాలంటే కష్టము. ఈ నాడు ప్రభుత్వం ఎన్నోకోట్ల రూపాయలు ఖర్చుచేస్తున్నప్పుడు, ఏదో కొంతపని ప్రారంభమైనప్పుడు, యింకా చాలదనడం ఒకేసారి మిరాయిని మ్రిగాలంటే యెంతకష్టమో, యిదికూడా అంతకష్టమేనని అంటాను. ప్రాజెక్టు పనులు gra ual గా జరుగుతవికాని, తొందరపడిన ప్రయోజనములేదు. అందువల్ల గవర్నరు యిచ్చిన sp.ech కి మనము అభినందించాలి.

ఇక ప్రాజెక్టుల విషయములో, గోదావరి waters ను గురించి గవర్నరు speech లో ఏమియూ చెప్పబడలేదు. ఈ విషయములో నేనొక సంగతి చెప్పదలచాను. మా గోదావరి జిల్లాలో శబరి రిజర్వాయరు చాలా అవసరమై యున్నది. మా ఉభయ గోదావరి జిల్లాలలో ప్రధమపంటకు కొంతవరకున్నూ, రెండవ పంటకు పూర్తిగాను నీరులేకుండా రైతులు చాలా బాధలు పడుతున్నారు. అందుకు యీశబరి ప్రాజెక్టును త్వరలో కట్టినట్లయితే, యింకను పోలవరంవద్ద మరొక డాముకట్టినట్లయితే, రైతులకు పుష్కలంగా నీరు సప్లయి అవుతుంది. వీటికిగూడా కొంతడబ్బు అవసరము గనుక, ప్రభుత్వము యివి రెండున్నూ కట్టిస్తారని ఆశిస్తున్నాను తక్కువ మొత్తంలో యీపని జరుపవచ్చును, కాబట్టి వెంటనే యీపని ప్రారంభించుటకు తగు ఏర్పాట్లు చేయవలెనని కోరుచున్నాను.

Indust ies విషయంలో యింతవరకు మనకు కొన్ని licenses యిచ్చారు. ఆంధ్రదేశములో ముఖ్యంగా textiles, sugar మొదలైన industries కు అవకాశంవున్నది. ఈ industries ను ఎవరైతే co-operative basis మీద నడుపుతారో, వారికే కేంద్ర ప్రభుత్వమువారు తప్పకుండా సహాయము చేస్తారని చెప్పారు. అందువల్ల యీ industries ను co-operative basis మీద నడిపేవారిని ప్రోత్సాహపరచి, వారికే licenses యిచ్చేటట్లుగాను, యితరుల కెవ్వరికీ యివ్వకుండాను చేయమని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ విధంగాచేస్తే co-operative సంస్థలను, సహకార విధానమును, వృద్ధిలోకి తేవచ్చునని నా అభిప్రాయము.

ఇకపోతే, weavers విషయములో ఒక విషయము మనవిచేస్తాను. Co-operative societies ద్వారా యీ weavers కు సహాయము చేస్తున్నప్పటికిని, ఒక్క విషయము మాత్రము గమనించవలసి వుంది. మిల్లులలో తయారయే బట్టలలో ధోవతులు, చీరలలో కనీసము సగభాగము (50 %) అయినా మిల్లులో తయారు చేయడము తగ్గింపజేసి, ఆభాగమును weavers చేత తయారుచేయించి, మార్కెటులో యీ weavers తయారు

25th April, 1955] (Sri Addepalli Satyanarayana Murthi)

చేసిన సరకునే కొనేటట్లుగా చేస్తే weavers కు మరొక విధంగాగూడా సహాయము చేసిన ట్లవుతుంది. అందువల్ల, weavers కు co-operative societies ద్వారానే కాకుండా, యీ విధంగా కూడా సహాయముచేయుట మంచిదేనని నా అభిప్రాయము.

మరొక విషయం వున్నది Municipalities కు ఒకకోటి రూపాయలు అప్పురూపంగా యివ్వబోతున్నారని గవర్నరుగారి ఉపన్యాసంలో చెప్పబడింది. ఇది చాలా బాగానేవున్నది. ముఖ్యంగా రెండవ తరగతి, మూడవ తరగతి మునిసిపాలిటీలు చాలా వెనుకబడి యున్నవి. ఈ మునిసిపాలిటీలు ఏర్పాటు కాబడ్డవే గాని, యివి పల్లెలు కాకుండా, పట్టణములు కాకుండా వున్నవి వీటిల్లో drainage and water schemes చాలా అవసరముగా వున్నవి. ఇప్పుడు ఒక కోటి రూపాయలు మునిసిపాలిటీలకు అప్పు యిస్తారంటే ఆడబ్బు మునిసిపాలిటీ లన్నింటికి చాలదు గనుక కేంద్ర ప్రభుత్వమువారికి నచ్చజెప్పి drainage and water schemes యీ మునిసిపాలటీలలో త్వరగా వచ్చేటట్టుగాను, అందుకుగాను యింకను కొన్నికోట్ల రూపాయలు కేంద్ర ప్రభుత్వాన్నుంచి పొందవలెననిన్నీ 25% contribution యివ్వవలెనని విజ్ఞప్తి చేస్తున్నాను.

మరొకవిషయం మనవిచేస్తాను. ఈమధ్య electricity విషయములో యింతవరకు చాలా డబ్బు ఖర్చుచేసినట్లుగా గవర్నరుగారి speech లో చెప్పబడింది. అయితే దానిపై returns చూస్తే చాలా తక్కువగా వుంటున్నవి. ఎక్కువగా return వచ్చేదానికి, యీ మధ్య రేట్లు హెచ్చించారు. ఇదివరకటికంటె యిప్పుడు పెద్ద industries విషయములో రేటు 187% పెరిగింది. Small industries విషయములో 400% పెరిగింది తరువాత heating circuits కు 350% పెరిగింది మనము ఆదాయం రాబట్టుకోవాలి గనుక, జమఖర్చులు సరిపోతూండాలి గనుక, రేట్లు పెంచడం అవసరమే. Industrialists నూ, consumers నూ, small scale industrialists నూ encourage చేయాలి గనుక, మన current వారు తీసుకోవడానికి హుషారు చేయాలి గనుక. వారికి హెచ్చురేట్లు వేస్తే మనం ఖర్చుపెట్టిన సొమ్ము అక్కడ అలాగే వుండిపోతుంది. గనుక, అలా కాకుండా వారికి యీ రేట్లను reasonable గా వేయాలని అంటున్నాను. అప్పుడు యీ 300%, 500% వున్నదానిని తగ్గిస్తే ఎక్కువమంది electricity ని వుపయోగించుకొనుటకు వీలుఅవుతుంది. అప్పుడు మనకు income గూడా జాస్తిగావస్తుంది. కారణమేమంటే, ఒక 0-0-3 లాభము రావాలంటే sales ఎక్కువగా వుంటవి, 0-1-0 లాభము రావాలంటే తక్కువగా వుంటవి, 0-4-0 లాభము రావాలంటే sales యింకా తక్కువగా వుంటవి. అంటే అది business లక్షణమని మా వుద్దేశ్యము. అది business చేసేవారికే తెలుస్తుంది కాని బైటవారికి తెలియదు. అందువల్ల electricity ను cheap rates లో సప్లయి చేసినట్లయితే, consumers జాస్తిగావుంటారు, లాభముగూడా రావటానికి ఎక్కువ అవకాశాలుంటవి. అందువల్ల నేనిచ్చేసలహామ పాటించి ఎక్కువ గ్రామాలకు electricity ని cheap గా supply చేయించినట్లయితే, ఎక్కువగా income రావటానికి వీలు అవుతుంది. కాబట్టి వెంటనే గ్రామాలలో వున్నవారికి తక్కువ రేట్లకు electricity సప్లయి చేయమని కోరుతున్నాను. మునిసిపాలిటీలకన్న ప్రజలకుయిస్తే

చాలా లాభమువస్తుంది. కాని హెచ్చు రేట్లకు electricity ని supply చేస్తే సామాన్య ప్రజానీకం అధిక సంఖ్యాకులుగా వున్నప్పటికిని, వారు electricity ని కొనుక్కోలేరు. గనుక, హెచ్చు రేట్లతో జిల్లాబోర్డులకు మునిసిపాలటీలకు తప్ప యితరులకు సప్లయిచేయటానికి అవకాశము వుండదు. అప్పుడు income గూడా తగ్గిపోతుంది, గనుక అధిక సంఖ్యాకులున్న గ్రామాలకే electricity ని ముందు సప్లయిచేయాలని మనవి చేస్తున్నాను. టైము అయినందున నేను యింతటితో విరమిస్తున్నాను.

Sri S. Narayanappa:—అధ్యక్షా, ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాత సాధారణ ఎన్నికలు జరిపించడం అయింది. ఈ ఎన్నికల చరిత్ర యావద్భారత దేశాన్నేగాకుండా ప్రపంచ దృష్టినికూడా ఆకర్షించింది. దాదాపు అయిదు మాసాలలో ఎన్నికలు జరిగిన తరువాత గవర్నరుగారు శాసనసభకువచ్చి వారి వుపన్యాసముద్వారా ఆంధ్రరాష్ట్రములో రాబోవు అభివృద్ధికరమైన పనులనుకూర్చి సూచనలు చేశారు. ఇంతకుముందు సుమారు మొదటి 18 మాసాలలో ఆంధ్రరాష్ట్రములో ముఖ్యమంత్రిగావున్న ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారి నాయకత్వాన ఉప ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవిరెడ్డిగారి సారథ్యాన ఎన్నో కార్యకలాపాలు, వ్యవసాయకంగా, పారిశ్రామికంగా, విప్లవాత్మకమైన కార్యక్రమాలు వారివల్ల సాధించబడ్డవి. అయితే ఆ కార్యకలాపాలనన్నిటిని సమీక్షచేసి గవర్నరుగారు విశదీకరించారు. ఇంకను విద్యా బోధన విషయంలోనూ, వైద్యవిషయంలోనూ, ఎన్నో గొప్ప మార్పులు ప్రభుత్వంవారు తల పెట్టినారు. అయితే వైద్యం విషయములో ముఖ్యంగా ఆయుర్వేదం, హోమియోపతి వైద్య విధానాలను అభివృద్ధికి తేవటానికి పంతులుగారు రెండు కమిటీలను ఏర్పాటు చేశారు. ఆ కమిటీలు విచారణజరిపి నివేదికలు ప్రభుత్వానికి అందజేసినవి. ఆ విషయములో ప్రభుత్వ విధాన మేమిటో, ప్రభుత్వం ఏమిచేయ తలపెట్టిందిన్నీ, గవర్నరుగారి ఉపన్యాసంలో ఏ మాత్రంగూడా తెలుపబడలేదు. కమిటీవారు చేసిన సూచనల దృష్ట్యా ప్రభుత్వం వైద్యం విషయంలో తగిన విధానములు ప్రణాళికలు తయారుచేయించి, ఆ కమిటీవారి సూచనలను అమలు పరుస్తారని విశ్వ శిస్తున్నాను.

అయితే అనుభవజ్ఞులైన శ్రీ గోపాలరెడ్డిగారి నాయకత్వాన ప్రస్తుత మంత్రివర్గము పనిచేస్తు వ్నది గనుక, దేశంలోని అన్నిజాతుల, అన్నివర్గాల అభివృద్ధికి అనుగుణంగా తగిన పథకాలు, ప్రణాళికలు అమలులోకి తేస్తారని ఆశిస్తున్నాను ఇప్పటికి ప్రథమ పంచవర్షప్రణాళిక నిర్వహణ పూర్తికావచ్చింది. ఇక రెండవ పంచవర్ష ప్రణాళిక ఆరంభం కాబోతున్నది. ఈ రెండవ పంచ వర్ష ప్రణాళిక నిర్వహణకు ప్రజల శ్రమదానం అత్యవసరమని చెప్పి కేంద్ర ప్రభుత్వంవారు తెలియ జేశారు. గ్రామాలలో నిరుద్యోగం నానాటికి పెరుగుతూవున్నది. గ్రామాలలో శ్రమదానం ఎంత వరకు లాభదాయకమో, ప్రభుత్వం తలపెట్టినటువంటి యీ ఆశయం యెంతవరకు ఫలించగలదో చూడవలసి యున్నది.

చేనేత పారిశ్రామికుల విషయంలో కేంద్ర ప్రభుత్వంవారు యిచ్చినటువంటి సెస్‌ఫండ్ వినియోగ విధానం ఉపన్యాసంలో కనపరచినందుకు చాల సంతోషం. గత 18 మాసాల్లో ప్రభుత్వం

చేనేత పారిశ్రామికులకు, సొసయిటీలకు పని కల్పించారు. 660 సొసయిటీలు పనిచేస్తూఉండేవి. వాటిలో ఇప్పుడు కొన్ని సొసయిటీలు పనిచేయకుండా స్తంభించిపోయినాయి. అందుచేత ప్రభుత్వం వాటికి తగినటువంటి ఆర్థిక స్తోమతు కల్పించగోర్తాను. చేనేత పరిశ్రమకు రక్షణ విషయంలో కేవలం సెస్‌ఫండ్‌ద్వారా కొన్ని ఎంపోరియంలకు రిబేటు యివ్వడంఅనే సదుపాయాలు చేయడంతో ప్రజానీకానికి వున్నట్టి బాధలు తీరవు. చేనేత పారిశ్రామికులకు నూలు తక్కువధరలకు లభ్యమయ్యేటట్లు చేయాలి. రిబేటు నగదురూపంలో యివ్వడంవల్ల ఎలాంటి లాభమూ లేదు. రిబేటును నూలురూపంలో యిస్తే ఎంతో ఉపయోగకరంగా వుంటుంది. ఈ విధానాన్ని అమలుపరిస్తే చాలా బాగుంటుంది. అంచు పంచలను, రంగు చీరలను చేనేత పారిశ్రామికులకు కేటాయించవలెనని మద్రాసు రాష్ట్రంలో సర్వపక్షాలు ఏకగ్రీవంగా చేసిన తీర్మానాన్ని రాజగోపాలాచారిగారు కేంద్ర ప్రభుత్వంవారికి పంపించారు. దీన్నిగురించి కొంత ప్రచారం జరిగింది. ప్రచారం గట్టిగా జరిగిందే గాని పని జరగడంలేదు. ఇప్పుడు గ్రామాలలో సొసయిటీలు పని చేయడంలేదు. ఈ సందర్భంలో ప్రభుత్వం collective centies ప్రారంభించి పనిలేనివారికి పని కల్పించి నిరుద్యోగ సమస్యను కొంతవరకు పరిష్కరించవచ్చు.

వ్యవసాయాభివృద్ధికి పెద్ద పెద్ద ప్రాజెక్టులు తలపెట్టి, నందికొండ ప్రాజెక్టుకు కేంద్రప్రభుత్వం వారి ఆమోదాన్నిపొంది ప్రారంభించినందులకు సంతోషాన్ని వెలిబుచ్చుతున్నాను. ఏ విధమైన పాక్షికదృష్టిలేకుండా ప్రభుత్వం ముందంజవేసి కేంద్రప్రభుత్వ సహాయం తీసికొని లక్షలాది ఎకరాలను సాగుచేసే యీ ప్రాజెక్టును నిర్మించి దేశంలో కరువు కాటకాలు లేకుండా చేస్తుందనే అభిప్రాయాన్ని మేము అంగీకరిస్తున్నాం. దానితోపాటు కరువు కాటకాలకు గురైన రాయలసీమ వారి బాధలను పోగొట్టే నిమిత్తం తుంగభద్ర ఎగువ కాలువను ప్రారంభించే ప్రయత్నంచేసి రాయలసీమను సశ్యశ్యామలంగా చేస్తారని ఆశిస్తున్నాను. గవర్నరుగారు యిచ్చినటువంటి ఉపన్యాసంలో చూస్తే అదేదో టెక్నికలు స్క్రూటినీ క్రింద ఉన్నట్లు బోధపడుతోంది. మైసూరు ప్రభుత్వానికి ఆంధ్ర ప్రభుత్వానికి తగువులున్నప్పటికీ వాటిని పరిష్కరించి యీ సంవత్సరంలోపుగానే తుంగభద్ర ఎగువకాలువను ప్రారంభిస్తారనే అభిప్రాయం కనపరిచారు. అందుకు సంతోషం. అదేరీతిగా వంశధార ప్రాజెక్టు, ఇతర చిన్న ప్రాజెక్టులు ప్రారంభిస్తారని ఆశిస్తున్నాను. తరువాత గ్రామాల్లో త్రాగుటకు మంచినీటిని సరఫరాచేసే పథకములకుగాను డబ్బుయివ్వలేని వారు శ్రమదానం యిచ్చే పద్ధతిని జయప్రదంగా సాగిస్తారని ఆశిస్తున్నాను.

వయోజన విద్యావిషయంలో కనీసం రాత్రిపూటయినా బడులు పెట్టించే పథకాన్ని అమలు పరుస్తారని ఆశిస్తున్నాను. ఉపాధ్యాయుల కష్టాలను తొలగించేటందుకు ప్రభుత్వం పూనుకుంటుందని ఆశిస్తున్నాను. ఉపాధ్యాయుల కష్టాలగురించి మనకు నాయకుడుగా వున్నట్టి శ్రీ గోపాలరెడ్డిగారు బాగా అర్థం చేసుకుంటారని, సహాయం చేస్తారని యీ విషయమై కొంత మొత్తాన్ని రాబోయే బడ్జెటులోనైనా కేటాయిస్తారనీ ఆశిస్తున్నాను.

10 రూపాయల శిస్తు రద్దు విషయంలో తాత్కాలికంగా ఆపామన్నది సంతోషించతగ్గ విషయం. కాని దానిని శాశ్వతంగా రద్దుచేసే అవకాశాలను గురించి యోచిస్తున్నారనుకుంటాను.

అసలు 3 కోట్ల రూపాయలలోటుకాకుండా యీ 10 రూపాయల శిస్తు మాఫీవలన ఏర్పడబోయే 4½ కోట్లలోటును ఏవిధంగా భర్తీచేయాలో ఆలోచించి, వచ్చే 6 మాసాల బడ్జెటులో పరిశీలించి పేదరైతులకు యిచ్చినటువంటి వాగ్దానాన్ని నిలుపుకుంటారని ఆశిస్తూ గవర్నరు ప్రసంగాన్ని ప్రశంసించే యీతీర్మానాన్ని బలపరస్తున్నాను.

Sri B. Rathnasabapathy Setty .—అధ్యక్షా, శ్రీ రాజేశ్వర రావుగారు గవర్నర్‌గారి ప్రసంగాన్ని అభినందిస్తూ మాట్లాడుతూ గత ఎన్నికలలో ప్రజా స్వామికపక్షాలు అఖండ విజయము సాధించినాయని చెప్పారు. అంతకంటే కాంగ్రెస్‌పక్షము అఖండ విజయము సాధించివుందని చెప్పివుంటే చాల బాగుండేది. ఎందుకంటే కాంగ్రెస్ పార్టీ ప్రజా స్వామిక పక్షముగా పరిగణించబడడం అనేది వివాదాంశము. గత ఎన్నికలలో కాంగ్రెస్ వారు చేసిన చర్యలు ప్రజాస్వామిక సిద్ధాంతాలకు అనుగుణముగా ఉన్నాయని నాకు నమ్మకములేదు. అందు వల్ల ప్రజాస్వామిక పక్షములనే దానికంటే కాంగ్రెస్‌పక్షము అఖండ విజయము సాధించినది అని చెప్పివుంటే బాగుండేది. దానిని గురించి సందేహము ఎవరికిలేదు. ఈ రోజున కాంగ్రెస్ పక్షము Assembly లో పెద్ద majority పక్షముగా కూర్చొనివుంది. ఆంధ్రదేశ ప్రజానీకము కాంగ్రెస్‌ను పెద్ద మెజారిటీతో గెలిపించి పంపించింది. కాంగ్రెస్ వారు ఏమి చేయదలచుకున్నారో అని ఆంధ్రప్రజలు ఎదురుచూస్తున్నారు. అటువంటి సమయములో యీ అసెంబ్లీలో గవర్నర్ గారు ప్రసంగము చేయడము జరిగింది. గవర్నర్‌గారి ప్రసంగములో ప్రజల కష్టాలుతీరే విషయాలుగాని, వాండ్లను ఎదుర్కొన్న సమస్యాపరిష్కారములు గాని కనిపించక పోవడము చాల నిరాశాజనకముగా కనిపిస్తున్నది. ముఖ్యముగా అధిక సంఖ్యాకులైన రైతాంగాన్ని ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించుటకు ఏలాంటి పథకము యీ ప్రసంగములో కనిపించడము లేదు. ఈ రోజువున్న సమస్యలలో ముఖ్యముగా రైతాంగము నెదుర్కొనే సమస్య రైతుపండించే పంటలకు ధరలు తగ్గి పోవడము. ఎక్కువ ధాన్యము మార్కెట్టుకు రావడము వల్ల ధరలు తగ్గడము జరిగింది. ఇప్పుడు ప్రభుత్వంవారు పోయిన సంవత్సరము procure చేసిన ధాన్య మును తక్కువధరకు విడుదల చేస్తున్నారు. అందువల్ల ధరలు తగ్గినది. అంతే కాకుండా రైతుకు కావలసిన వస్తువుల ధరతగ్గలేదు, ఈ విషయం ముఖ్యముగా ప్రభుత్వం గమనించవలసి యున్నది. దీనిని గురించి గవర్నర్‌గారి ప్రసంగములో ఎక్కడకూడా ప్రస్తావించక పోవడము చాల శోచనీయము. పోయిన సంవత్సరము బియ్యము ధరలు ఎక్కువగావున్నాయనే ఉద్దేశముతో ప్రత్యేకించి గవర్నమెంటు surplus జిల్లాలలో ప్రొక్యూర్ చేసినది. ఆ surplus జిల్లా లలో మొదటి రకము ధాన్యమునకు 20 రూపాయలు, రెండవ రకము ధాన్యానికి 14-15 రూపాయలు ధర ప్రజలు ఆందోళన చేసినందు వల్ల నిర్ణయించారు. ధరలు నిర్ణయించడములో రైతు కొను గోలు శక్తిని, రైతుకు కావలసిన వస్తువులధరలను దృష్టిలో పెట్టుకొని నిర్ణయించారు. కాని యీ సంవత్సరము గత సంవత్సరముకంటె ఉత్పత్తి ఎక్కువైంది. గవర్నమెంటు procure చేసిన ధాన్యాన్ని తక్కువ ధరలకు ఇప్పుడు release చేయడం జరిగింది. అందువల్ల ఇది వరకు 20 రూపాయలకు యిస్తున్న ధాన్యమును యీ సంవత్సరము 12 రూపాయలకు యిస్తున్నారు. ఇదివరకు 14 రూపాయలతో కొనుగోలుచేసిన ధాన్యమును యీరోజు 7 రూపాయలకు మార్కెట్టులో అమ్మకము చేస్తున్నారు. ఇటువంటి పరిస్థితులలో ధాన్యానికి మార్కెట్టు లేకపోవడము,

25th April, 1955] (Sri B. Rathnasabapathy Setty)

రైతులకు చాల కష్టాలు కలుగడము జరిగింది. ఆంధ్రదేశములో procure అయిన ధాన్యమును వ్యాపారస్తులు తీసుకొనకపోవడం జరిగింది. అందువల్ల రోజు ఆంధ్రదేశములో ఉత్పత్తి అయిన బియ్యము ఇక్కడనే నిలువ అయిపోవడము, రైతులకు కావలసిన వస్తువులకు ధర తగ్గకుండ వుండడము ప్రభుత్వానికి తెలుసు. గవర్నర్‌గారి ఉపన్యాసములో యీ విషయము తెలుపక పోవడము చాల శోచనీయము.

ఈనాముల విషయము ప్రత్యేకించి చెప్ప నవసరములేదు. ప్రజాసోషలిష్టుపార్టీ తరపున మేము కరివెనలో సత్యాగ్రహము చేశాము. మూడు వేల ఇనాములు వున్నాయని ప్రభుత్వముకూడ సూచనలు యిచ్చింది. ఈ రోజు అధికారములో వున్న ముఖ్య మంత్రి గారి అధ్యక్షతను ఇనాములను రద్దుచేయడానికి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ తీర్మానించింది గూడా. గవర్నర్‌గారి ప్రసంగములో కొద్దికాలములో ఈనాముల విషయములో ఒక reform తీసుకువస్తామని సూచింపబడినది. ఈ ప్రభుత్వంచేసిన సవరణవల్ల కేవలము పెద్దపెద్ద భూస్వాములకు రక్షణ కల్గించడం మాత్రమే అవుతుంది. ఇది చాల విషాదకరము.

ఈ రోజునకూడా కరివెనవంటి ఈనాము గ్రామములలో అనేకమంది పేదరైతులు బాధలు పడుతున్నారు. గవర్నమెంటు చేసినచట్టం ఇంతవరకు ఎవరికీ ఏవిధంగాను ఉపయోగపడలేదు. రైతులు ఇదివరకు చేసుకునే భూములు తీసుకోడంవల్ల చాలా కష్టాలు పడుతున్నారు. కట్టుకున్న ఇండ్లుకూడా శ్రోత్రియందార్ల చేతుల్లోవున్నాయి. ఈవిషయం గమనించకుండా ప్రభుత్వం కేవలం గ్రుడ్డిగాపోతోంది. ఆర్డినెన్సు వచ్చిన తరువాతకూడా ఆదోనిదగ్గర మంచెలఅనే ఈనాం గ్రామములో కొంతమంది పేద రైతులను ఈనాందారులు తొలగించారు. అప్పుడు గవర్నరుగారికి వెంటనే తెలిపితే, ఆయన బాధ్యతవహించి కొంత రక్షణ కల్పించడం జరిగింది. ఈ మాత్రం కూడా ప్రజా ప్రభుత్వం చేయకపోవడం శోచనీయం. ఆ తీర్మానం కాంగ్రెస్సు కమిటీ ఆమోదించి నపుడు గోపాలరెడ్డిగారు కాంగ్రెసు ప్రెసిడెంటుగా వున్నారు. వారు అధికారంలోనికి వచ్చి కూడ సరియైన చట్టాన్ని తీసుకురాకపోవడం శోచనీయం. ఈ విషయములో తగిన సవరణలు ప్రభుత్వం వారు తెస్తారని ఆశిస్తున్నాను. గవర్నరుగారి ప్రసంగానికి ధన్యవాదాలు చెప్పలే నందుకు విచారిస్తున్నాను.

*Sri M. Venkataraju.—అధ్యక్ష మహాశయా, గౌరవనీయులైన గవర్నరుగారు ఇచ్చిన ప్రసంగానికి అభినందించే రాజేశ్వర రావుగారి తీర్మానాన్ని నేను బలపరచుచున్నాను. వారు మనవిచేసినఅన్ని విషయాలలోను మాకు ఏమీ ఆక్షేపణలేదు. అయితే రెండు ముఖ్యవిషయములపై ప్రభుత్వదృష్టి తీసుకురావటానికి నేను మాట్లాడదలుచుకున్నాను. వ్యవసాయ కూలీలగురించి, చిన్న రైతులగురించి బహు తక్కువమూపు చూపుచున్నారు. రాష్ట్రంలో వారిసంఖ్య చాలా హెచ్చుగావున్నది. వారివోట్లు కూడా 80% వరకు వున్నాయి. రు 10 లు శిస్తు మినహాయింపును రద్దుచేసినారు. ఏమైనా 1, 2 ఎకరాలువుండే రైతులకు శిస్తుబాధ లేకుండా చేయకతప్పదు. ధాన్యం అమ్మకం ధర నిర్ణయించి దానిపై శిస్తువేయండి లేకుంటె అంచెలవారీశిస్తు వెయ్యండి. ఏదోమార్పు తీసుకురాకపోతే వారు భోజనానికి పడేబాధ భరించలేకుండా ఉన్నారు. అనేక సంవత్సరాలుగా కాంగ్రెసువారు బ్రిటిషువారిని పంపించివేయడానికి చిన్నరైతులకు పన్ను లేకుండా చేస్తామని అనేక

సార్లు వాగ్దానాలు చేసివున్నారు. వాటిని పాటించకుండా వుండడానికి వీలులేదని మనవిచేస్తున్నాను. 70 % వ్యవసాయ కూలీలు వున్నారు. వారికి సంవత్సరానికి మూడుమాసాలు, నాలుగు మాసాలకంటె కూలీ దొరకదు. ఫాక్టరీలలో పనిచేసే కూలీలకు అనేకమైన విషయాలలో సహాయం చేస్తున్నారు. వారికి సంవత్సరము పొడుగూన కూలీవుంటుంది. ఉచితంగా విద్య, మందులు ఇప్పిస్తున్నారు. వ్యవసాయ కూలీలకు ఇటువంటి ఏర్పాట్లులేవు. మూడుమాసాలకు వచ్చే కూలిపోతే మిగతా 9 మాసాలు వారికి గంజి, గుడ్డ దొరకవు. ఇటువంటి వాళ్లకుకూడా భూములు ఇచ్చే విషయములో వేలం వేయకూడదు. కొద్దిధర తీసుకోవచ్చునుగాని ఎక్కువధర ఆశించి వేలం వేయరాదని అంటున్నాను.

మైనరుపోర్టులను గురించి గవర్నరుగారు చెప్పారుకాని ప్రభుత్వం ఎక్కువశ్రద్ధ తీసుకున్నట్లు లేదు. మా గుంటూరు జిల్లానుంచి ఎన్నోకోట్ల విలువైన పొగాకు, వేరుశనగ, మిర్చి విదేశాలకు ఎగుమతి చేస్తున్నాము. నిజాంపట్నం, చీరాల రేవుల అభివృద్ధిగురించి ఇంతవరకు శ్రద్ధవహించ లేదు. విశాఖపట్నం, మచిలీపట్నం రేవులనుంచి ఎగుమతులు ఎంతో వ్యయప్రయాసలకు ఓర్చి చేయవలసివచ్చుచున్నది. చీరాల, నిజాంపట్నం రేవులను అభివృద్ధిచేస్తే ఈ పొగాకు ఎగుమతి విషయములో ఎన్నో యిబ్బందులుపోయి, సౌకర్యంగా వుంటుందని మనవి చేస్తున్నాను. రహదారి సౌకర్యాల విషయంలో కేవలం ప్రభుత్వం చాలా అశ్రద్ధచేసింది. కొన్ని రహదార్లవెంబడి కార్లు పోలేవు సరికదా, దున్నపోతుల బండ్లుకూడా నడవలేని స్థితిలో వున్నాయి. జిల్లాబోర్డులు కూడా ప్రభుత్వంలో ఒకభాగమే. వాస్తవిక పరిస్థితులను చక్కదిద్దకుండా ప్రభుత్వం ఎన్ని సిద్ధాంతాలను ప్రకటించినా ప్రజలు హర్షించలేని స్థితిలోవున్నారు. ఈ రోడ్లపై గుంటలులేకుండా ప్రయాణ సౌకర్యాలు వుంటేనే హర్షిస్తారు. అందుచేత వాటిని బాగుచేయవలసిందిగా మనవి చేస్తున్నాను. 4,5 ఫాక్టరీలకు licence యిచ్చామని అంటున్నారు. వారికి ఎన్ని లైసెన్సులు ఇచ్చినా ప్రజలకు గాని ప్రభుత్వానికిగాని లాభములేదు. ముఖ్యంగా సిమెంటు ఫాక్టరీలు వున్నాయి. ప్రైవేటు వ్యక్తులకు ఈ విషయంలో లక్షలుఇచ్చే బదులు ప్రభుత్వమే నందికొండ, విజయవాడలదగ్గర ఫాక్టరీలు నిర్మించి ప్రాజెక్టుకు కావలసిన సిమెంటు తామే తయారు చేసుకుంటామని అంటే కేంద్ర ప్రభుత్వం వారు అభ్యంతరం చెప్పరనుకుంటాను. మైకాగనుల విషయంలో ఒక co-operative సంస్థస్థాపించి వ్యాపారం చేయవలసిందిగా మనవి చేస్తున్నాను. కాంగ్రెసువారి సిద్ధాంతంకూడా co-operative commonwealth స్థాపన. కాబట్టి ఈరకంగా చేస్తే బాగుంటుంది. దీనికిగాను చిన్నవ్యాపారాలు co-operative సంస్థలద్వారా జరిగేట్లా చేయడం చాలాఅవసరం. దానివల్ల ఎక్కువలాభం సంఘానికి ప్రభుత్వానికి కలుగుతుంది. పన్నులు వేయరాదని చెప్పడంలేదు కమ్యూనిష్టులు మాదిరిగా. పన్నులువేయండి కాని చిన్నవారిమీద పడకూడదు. చిన్నరైతులు కూలీలమీద పడకూడదు. పెద్దవారిమీద పన్నులువేసి ప్రజలకు సహాయంచేయాలి. సుందరయ్యగారి మాదిరిగా దోపిడీడబ్బు తీసుకువచ్చి చేయమని చెప్పడంలేదు. పన్నులు సరిగావేసి ప్రజలకు సహాయం చేయాలని ప్రార్థిస్తూ విరమిస్తున్నాను.

*Sri T. Jalayya:—అధ్యక్షా, ఈరోజున శ్రీరాజేశ్వరరావుగారిచే ప్రతిపాదింపబడిన గవర్నరుగారిని అభినందించే తీర్మానమును నేను బలపరుస్తున్నాను. ముఖ్యముగా గవర్నరుగారి ఉపన్యాసములో పేదలయొక్కయు, భాగ్యవంతులయొక్కయు సంగతి విరివిగా కన్పిస్తున్నది గాని,

25th April, 1955] (Sri T. Jalayya)

మధ్యరకపు వర్తకులసంగతి గాని, రైతులయొక్క ప్రస్తావనగాని లేనందుకు విచారిస్తున్నాను. ముఖ్యముగా ఈగవర్నమెంటు చాలా ఉత్తమమైన గవర్నమెంటు అని నమ్ముచున్నాను. ఎందుకనగా ఈ ప్రభుత్వనాయకుడు చాలా ఉత్తమమైన తెలివితేటలు గలవారు. అందుచేతను చాణిక్యుని బోలిన శ్రీ కళావెంకటార్రావుగారు మొదలగు మంత్రులు ఉండడంవల్ల ఈప్రభుత్వము ప్రజలకు ఎక్కువగానే సదుపాయాలు కలుగజేస్తారని నా అభిప్రాయము మద్రాసు రాష్ట్రములో శ్రీగోపాలరెడ్డిగారు Finance Minister గా ఉండినప్పుడు sales tax ను కామధేనువుగా వర్ణించారు. ఇప్పుడు 3 కోట్ల రూపాయలు deficit వచ్చిందంటే ఇందుకు కారణంఏమిటో వారు విచారించి నట్లులేదు. దీనికికారణం ఆకామధేనువుకు సరిగా మేతపెట్టక, నీళ్లుపోయకుండా పోవడమే. అందుకనే ఆకామధేనువు సరిగా పాలు ఈయలేదనే నా ఉద్దేశము మధ్యవర్తకులకు ఎంతగట్టిగా రక్షణఇచ్చి పోషించితే కామధేనువు అంతఎక్కువగా sales-tax ను ఉత్పత్తిచేస్తుంది దానివల్ల బాగా లాభంరాగలదని నమ్ముచున్నాను. అంతేకాక ఈ multi-point sales-tax మూలాన చాలాకష్టం కలుగుచున్నది. అట్లుకాకుండా single-point sales-tax విధించినట్లయితే, గవర్నమెంటుకు ఇప్పుడు కావలసిన 3 కోట్లు మాత్రమే కాకుండా. ఇంకా ఎక్కువ వరుమానం వస్తుందని నా ఉద్దేశ్యం ఈ multi-point sales-tax వేయడంవల్ల చిన్నవర్తకులు వ్యాపారంచేసుకొనుటకు చాలా కష్టంగాఉంటుంది. ఈవిషయంలో ప్రభుత్వానికి సరియైన సలహాలు ఇవ్వవలసియుంటుంది ఏ చదువుకొన్నవారినో లేక ఏ డిగ్రీపొందినవారినో ఈ కమిటీలో సభ్యులుగా వేసినంతమాత్రంచేత సరిపోదు. వర్తకములో కొంత అనుభవము గలవారిని సలహాలు తీసుకొని ఆవిధంగా ఈ revenue ను వృద్ధిచేసుకోవలసిందని గవర్నమెంటును ప్రార్థిస్తున్నాను. ముఖ్యముగా ధరలు తగ్గిపోయిన కారణంచేత sales-tax పూర్తిగా వసూలు అవుటలేదు. మాజిల్లాలో అంతటా ప్రచారంచేసి sales-tax తగ్గకుండా చేసే సదుపాయాలు ఎన్నో చేసినాము. కనుక ఈ చిన్నవర్తకులమీద ప్రభుత్వం సానుభూతిచూపించి, single-point sales-tax ను అమలు జరుపవలెనని మనవి చేస్తున్నాను.

తరువాత పెద్దపెద్ద మునిసిపాలిటీలలో గవర్నమెంటు స్థలాలలో బీదవారు గుడిసెలు వేసుకొనుట ఎక్కువఅయిపోయింది. రానురాను ఈగుడిసెలు పట్టణానికి అందవికారంగా తయారవుతున్నాయి. ఇదివరలో గవర్నరుగారు గుంటూరు వచ్చినపుడు "మీపట్టణము అందంగా లేదే" అని అన్నారు. మొన్నటిరోజున మరల రాజభవనం విందులో కలుసుకొన్నప్పుడు "మీపట్టణము బాగు చేసుకోన్నారా" అని ప్రశ్నించారు. గుడిసెలు ఎక్కడపడితే అక్కడ వేసుకోవడంవల్ల పట్టణంయొక్క అలంకారము చెడుతుంది. అందుచేత బీదవాళ్లకు గుడిసెలు వేసుకోడానికి ప్రభుత్వమువారు ప్రత్యేకస్థలాలు ఇచ్చి, వారికి తగు సదుపాయము లిస్తూ పట్టణముయొక్క అందమునుగూడ పెంపొందించుటకు ప్రభుత్వము సహాయము చేయవలెనని కోరుచున్నాను. మునిసిపాలిటీవారు ఏవిధమైన ఖర్చు పెట్టుకోలేరు. కనుక పట్టణాన్ని అందంగా ఉంచుటకు ప్రభుత్వమువారే తగిన చేయూతనిచ్చి బాగుపరచవలెనని కోరుచున్నాను.

Elementary grade ఉపాధ్యాయులకు ఇచ్చే జీతాలు వారికి సరిగా అందక వారు ఎంతో కష్టపడుతున్నారు. ప్రజలందరికి విజ్ఞానమునిచ్చి పెద్దచేసేటటువంటి ఉపా

ధ్యాయులను ఈవిధంగా కష్టపెట్టడం చాల విచారకరముగా యున్నది. కనుక ఉపాధ్యాయులకు జీతాలు సక్రమముగా ఇచ్చి వారికి తగిన ప్రోత్సాహము ఇవ్వవలసిందని నేను కోరుతున్నాను.

ముఖ్యంగా సుందరయ్యగారి ఉపన్యాసంలో మొన్నటి ఎన్నికలలో ఏమోమో జరిగిందని ఏదేదో చెప్పారు. కాని గుంటూరు పట్టణములో కమ్యూనిస్టులు ప్రజలను పెట్టినంతబాధ చెప్పనలవికాదు. ఎక్కడచూచినా బజార్లవెంబడి కార్లువేసుకొని ఎంతో హడావిడిచేస్తూయుంటే మేము హడలిపోయాము. కమ్యూనిస్టులు బీదవాళ్లంటారు కాని ఇంత ప్రచారానికి డబ్బు ఎక్కడనుంచి వచ్చిందని ఆశ్చర్యపోయాము ముఖ్యంగా వాళ్లు ప్రజలను పెట్టిన బాధలు, వారి బెదరింపులు చెప్ప సాధ్యముకాదు. ఓట్లు ఇవ్వకపోతే ఏంచేస్తామో చూచుకొమ్మని బెదరించారు. కాని కాంగ్రెసువాళ్లు గాని, పోలీసులుగాని ఏలాటి దౌర్జన్యానికి దిగలేదు. ఒక గుంటూరు పట్టణమేకాదు మాజిల్లా యావత్తుకు సంబంధించిన విషయము చెప్పుచున్నాను. కాని ఎన్నికలను పోలీసుఉద్యోగస్థులు చాలా సవ్యంగా నడిపించారు. వారిని అందుకు అభినందిస్తున్నాను. ముఖ్యంగా ప్రభుత్వానికి ఒక మనవి చేస్తున్నాను. ఈకమ్యూనిష్టులు ఎప్పుడూ మంచిని చెడుగాను, చెడును మంచిగాను వర్ణిస్తూ యుంటారు. కనుక వారుచెప్పిన మాటలను లెక్కచేయక, ప్రజానీకానికి కావలసిన సదుపాయాలు మాత్రము చేయవలసిందని కోరుతూ విరమిస్తున్నాను.

Sri P. Venkatasubbayya:—అధ్యక్ష మహాశయా! ఈ దినము గవర్నరుగారి ఉపన్యాసమునకు అభినందన తీర్మానం ప్రతిపాదించబడి, ఆ ఉపన్యాసంగురించి చర్చ జరుపుకొంటున్నాము. ఈ అభినందన తీర్మానాన్ని నేను కూడ బలపరుస్తూ, గవర్నరుగారికి అభినందనలు తెలియపరుస్తున్నాను. 1954-55 సంవత్సరములో హరిజనులకుగాను 10 లక్షల రూపాయలు కేటాయింపుచేసి, వాళ్లకు యిళ్ల స్థలాలకు ఖర్చుపెట్టుటకు నిర్ణయించారు. 1955-56 లో మళ్లీ 2.6 లక్షలు కేటాయింపుచేసి 10 లక్షల రూపాయలు ప్రత్యేక నిధిక్రింద కేటాయింపు చేసినట్లు గవర్నరుగారి ఉపన్యాసంలో కన్పిస్తున్నది. ఈ 10 లక్షల రూపాయలు వారికి నివేశన స్థలాలకుగాను ఖర్చుపెట్టుటకు నిర్ణయించారని చెప్పడం చాలా బాగా ఉన్నది. కాని ఈ పది లక్షలరూపాయలు ప్రతి సంవత్సరం ఖర్చు పెడుతున్నారా లేక అది అలాగే ఉండిపోతున్నదా అనేటటువంటిది ఆలోచించవలసి యున్నది. ఈ ఇళ్లస్థలాలు acquire చేయడంలో చాలా సాధకబాధకాలు ఉన్నవి. వీటిని గురించిన అర్జీలు 10,12 ఏండ్లుగా pending లో ఉండిపోతున్నవి. ఈ స్కీము క్రిందపనులు చాలా వెనుక బడుచున్నవి. చురుకుగా జరగడంలేదు. ఈ పది లక్షల రూపాయలలో గత సంవత్సరం ఎంత ఖర్చు పెట్టబడిందో మంత్రుల ఉపన్యాసములలో చెప్పితే బాగుంటుందని మనవిచేస్తున్నాను.

తరువాత local development schemes క్రింద హరిజనులకుగాను బావులు త్రవ్వవలసివస్తే వాటికయ్యే ఖర్చులో నూటికి 50 వంతులు హరిజనులు కట్టవలసియున్నదని కలెక్టరుగారు చెప్పుతున్నారు. కాని హరిజనులు ఈ సగము భాగముకూడ పెట్టుకోలేని స్థితిలో ఉన్నందువల్ల, అనేక బావులను cancel చేసినట్లు కలెక్టరుగారు District Planning Committee లో తెలియజేశారు. హరిజనులు ఏమాత్రం ఖర్చు భరించలేరు గనుక, వారికి ఉచితంగానే మంచినీటి వసతిని కల్పించవలెనని నేను మనవిచేస్తున్నాను.

తరువాత గవర్నరుగారి ప్రసంగంలో ప్రాజెక్టుల విషయం గురించి ప్రస్తావిస్తూ వంశధార, నందికొండ ప్రాజెక్టులు త్వరలో అమలు కాగలవని చెప్పారు తుంగభద్ర హైలెవెల్ కెనాల్ విషయంగురించి మైసూరు గవర్నమెంటుతో సంప్రతింపులు జరుగుతున్నవని, ఆ సంప్రతింపులు ముగిసిన తరువాతనే దీనిని తీసుకొనుటకు సాధ్యమౌతుందని చెప్పారు తుంగభద్ర హైలెవల్ కెనాల్ కడప వరకు వచ్చి అనేక లక్షల ఎకరాలను సాగు క్రిందికి తీసుకొనివచ్చే అవకాశముంది, కనుక వెంటనే ప్రభుత్వము కృషిచేసి దీనిని రెండవ పంచవర్ష ప్రణాళికలోనైనా చేర్చి అమలు జరుపవలసిందని ప్రార్థిస్తున్నాను.

ముఖ్యంగా, కడపజిల్లా, రాజంపేట తాలూకాలో ఏ ప్రాజెక్టు వసతికూడా లేకుండా నీటివసరులకోసం ప్రజలు చాలా కష్టాలకు గురిఅవుతున్నారు. అక్కడ భావినగడ్డ ప్రాజెక్టు అనేటటువంటిదాన్ని గురించి అనేక సంవత్సరాలుగా ఆందోళన చేస్తూవచ్చాము దాని original scheme ను త్రోసి రాజని అక్కడ చెయ్యేటిపైన చిన్న చెరువులు కట్టడానికి నిర్ణయం జరిగింది ఆ చెరువులవలన అట్టే లాభములేదు. Original స్కీమునే అమలుపరచాలి. మఱియు ఆతాలూకాలో కోడూరుదగ్గర వాగేటికోన ప్రాజెక్టు అనేటటువంటిది ఉన్నది. పోయిన సంవత్సరం దాన్నిగురించి ప్రస్తావనచేశాము. ప్రభుత్వము పరిశోధన చేసిందికూడా. అయితే దానిఫలితము ఏమైందీ తెలియదు. ఈ వాగేటికోన ప్రాజెక్టు పనికూడ తీసుకోవలసిందని మనవిచేస్తున్నాను.

కడపజిల్లాలో జమ్మలమడుగు తాలూకా తలమంచిపట్టణంలో మాత్రం national extension service schemes వున్నవి. ఇదిగాక K C. canal area అంతా గూడా community project area లో వున్నది. రాజంపేట, రాయచోటి, బద్వేల్ తాలూకాలలో ఏమాత్రం అభివృద్ధికరమైన పనులుచేయటానికి వీలులేకుండా వున్నది. ఏపనులు చేసినా గూడా యీ community project scheme లోనూ national extension service blocks లోనే జరుగుచున్నవి. ఈ national extension blocks లోని పనిపూర్తిగా అమలుపరుస్తామని అనుకుంటున్నాము. కనుక రాజంపేట తాలూకాలో గూడా national extension service blocks ను community project schemes ను ప్రవేశపెట్టవలసిందిగా కోరుచున్నాను.

Electricity విషయములో మాచ్ ఖండు ప్రాజెక్టు పని పూర్తి అయిన తరువాత, 1956 వ సంవత్సరములోనే అనేక గ్రామాలకు విద్యుచ్ఛక్తి సప్లయి అవుతుందని, యిప్పటికి 815 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సప్లయి చేయబడుతున్నదని చెప్పారు. ఇకరాబోవు పంచవర్ష ప్రణాళికలో 1800 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సప్లయి చేయబడుతుందని చెప్పారు. కడప కోడూరు మధ్య electric line వేస్తూవున్నారు. అచ్చట ఒక thermal station కట్టి విద్యుచ్ఛక్తి సప్లయి చేయుటానికి సంకల్పించబడింది. అయితే బద్వేల్, జిల్లి ఫిర్కాలో విద్యుచ్ఛక్తి సప్లయిలేనందున అక్కడి రైతులు వ్యవసాయానికి కష్టపడుతున్నారు. వ్యవసాయానికి బావులు త్రవ్వితే చాలా ఉపయోగపడుతవి. ఆ ప్రదేశాలలో బావులు త్రవ్వితే, సంవత్సరము పొడుగూనా బావులలో నీరు వుంటుంది. ఇప్పుడువున్న బావులలోనుంచి నీరుతోడుకోటానికి 500, 600 రూపాయలు పెట్టితేగాని ఎద్దులు దొరకటములేదు, అంతడబ్బు పెట్టి కొనటానికి రైతులవద్ద డబ్బులేక అనేక కష్టాలు

(Sri P. Venkatasubbayya) [25th April, 1955

పడుతున్నారు. విద్యుచ్ఛక్తి సప్లయిచేస్తే యింత ఖరీదుపెట్టి ఎద్దులు కొనవసరముండదు. రైతులు అంత ఖరీదుపెట్టి ఎద్దులు కొనుక్కోలేకుండా ఉన్నప్పుడు విద్యుచ్ఛక్తి వుంటే, వాళ్లకు చాలా వుపయోగముగా వుంటుంది. వ్యవసాయము సులభముగా సాగించుకోగలరు. అందువల్ల చిట్వేల్‌నుంచి కోడూరుకు 15 మైళ్ల దూరము విద్యుచ్ఛక్తి లైనువేయమని కోరుతున్నాను. మరియు ఓబిలినుండి చిట్వేలికి ఒకలైను వేయమని కోరుతుతున్నాను. ఈ లైనువేస్తే, ఆప్రాంతమంతా విద్యుచ్ఛక్తి సప్లయి చేయటానికి వీలవుతుంది.

Co-operative సంస్థలను గురించి నేనొక విషయము మనవి చేస్తున్నాను. Co-operative సంస్థల అభివృద్ధికిగాను కేంద్ర ప్రభుత్వమువారు బ్యాంకుల ద్వారా 40 లక్షల రూపాయలు అప్పుగా యివ్వటానికి శాంక్షను చేశారని తెలుస్తున్నది. ఈ సొమ్ము ముఖ్యంగా బావులు త్రవ్వటానికి, oil engines కొనటానికి electric moter pump sets కొని ఉపయోగించుటకు యిచ్చినట్లు తెలుస్తున్నది. ఈ పైకము co-operative సంస్థలద్వారా వినియోగించేటట్లయితే, అందువల్ల లాభము, ప్రయోజనము వుండదు. కారణమేమిటంటే, యింతవరకువున్న co-operative societies ఎంతవరకు అభివృద్ధిగాంచినవో ప్రభుత్వము గమనించాలని అంటున్నాను. ఈ సొసైటీలు ఏమైనా అభివృద్ధికరంగా పనిచేస్తున్నవా అని అడుగుచున్నాను. ప్రభుత్వోద్దేశము జయప్రదమయిందా అని పరిశీలించి సమాలోచించుకొన్న తరువాతనే ప్రభుత్వము యీ సొమ్ము ఖర్చుచేయ వీలవుతుంది. ఇంతవరకు రెవిన్యూ డిపార్టుమెంటు ద్వారా బావులు త్రవ్వటానికి, ఎద్దులు కొనుక్కోవటానికి రైతులకు అప్పులిస్తూవచ్చారు. ప్రతి రైతూకూడా అప్పు తీసుకునేవున్నారు. ఆ అప్పులు యింతవరకు వసూలుకాలేదు. మరల యీ సొమ్ముకూడా సహకార సంస్థల ద్వారా ప్రభుత్వము అప్పులిస్తామనుకుంటే, ఏ దొంగ చాటుగానో బినామీలోన్సు సృష్టించుకొని అప్పులు తీసుకోటానికి ప్రయత్నిస్తారు. ఇదివరకు యిచ్చిన సొమ్ము ఏ విధంగా దుర్వినియోగమయిందో, సొమ్ము కూడా అదేవిధంగా దుర్వినియోగమే అవుతుందిగాని, ప్రయోజనము వుండదు. ఇప్పటికి నా స్వానుభవమువల్ల, నాకు తెలిసినంతవరకు ఒక ఉదాహరణ చెపుతాను. కడప జిల్లా రాజంపేట తాలూకాలలోవున్న సొసైటీలు చాలామటుకు mismanagement లో వున్నవి. ఆ సొసైటీల అధ్యక్షులు కార్యదర్శులు పెత్తందార్లుగా వుండడమువల్ల, Central Bank నుంచి డబ్బు తీసుకొనివచ్చి బినామీ అప్పులు పుట్టించి అంతా స్వాహాచేశారు. ఇక ముందుకూడా అదే జరుగుతుంది. కేవలము రైతులకు వుపయోగపడడము లేదు. వాళ్ల యిబ్బందులు ఎప్పటిమాదిరిగానే వున్నవి. కాబట్టి కోఆపరేటివ్ సంస్థలద్వారా అప్పు యిస్తే డబ్బు చాలామటుకు దుర్వినియోగమే అవుతుంది. కనుక co-operative societies ద్వారా డబ్బు యివ్వవద్దంటాను. ఇంతవరకు వున్న co-operative societies యొక్క management ఏ విధంగా వున్నదీ ఒక committee నివేసిదర్యాప్తుచేయాల్సివున్నది. (Interruption by an hon. Member) కడపలో దుర్వినియోగము అయిందని గట్టిగా చెప్పగలను. అది నాకు తెలుసును, నేను యీ co-operative సంస్థలమీద 15 సంవత్సరములు Inspector గా పనిచేశాను. వాటి నిజస్థితి నాకు బాగా తెలుసును స్వానుభవమువల్ల చెబుతున్నాను. దీనిని ఎవరూ కాదనలేరు. కనుక యీ co-operative సంస్థలు నిష్ప్రయోజనమనే అంటున్నాను. ఈ సంస్థలకు బదులు మరేదైనా

25th April, 1955] (Sri P. Venkatasubbayya)

సంస్థలు నెలకొల్పిననూ పరవాలేదు. ఈ co-operative సంస్థలు బాగా పనిచేయటానికి, యింకను మన State లో సరియైన వాతావరణం పుట్టలేదనే నా నమ్మకము. ఈ సంస్థలు స్వార్థపరుల చేతులలో లేకుండా నిస్వార్థపరులకు అప్పజెప్పితే బాగా పనిచేస్తవి. అంటే self interest తో పనిచేసేవారుండకూడదు. అప్పుడే యీ సంస్థలు అమోఘంగా పనిచేస్తవి. ఈ co-operative societies ను వృద్ధికితేవాలని ప్రభుత్వము ఉద్దేశించినట్లయితే, ముందు primary schools లోనూ, high schools లోనూ, colleges లోనూ యీ co-operation ను పాఠ్యభాగముగా పెట్టించి, విద్యార్థులకు co-operation అంటే యేమిటో, దాని ప్రయోజనములేమిటో నేర్పిస్తే, అది వారు అర్థము చేసుకోగలరు పౌరులకు యీ సంస్థల ఉపయోగము తెలియగలదు. అటువంటి నమ్మకము ప్రభుత్వానికి కలిగిన తరువాతనే యీ సంస్థలు నెలకొల్పితే యివి దిగ్విజయముగా పురోభివృద్ధి పొందగలవు. అందువల్ల యిప్పుడు వున్న co-operative societies ను ఆపి, ఒక కమిటీ ద్వారా దర్యాప్తు చేయించి, వాటిలోని లోపాలను సవరించి అటుపిమ్మట యీ సంస్థలు నడిపించితే మంచిది. ప్రభుత్వము యీ విషయములో నా సలహా పాటిస్తారని ఆశిస్తున్నాను. అంతవరకు యీ సంస్థలు ఆపమని ప్రభుత్వానికి విన్నవించుచున్నాను

అధ్యక్షులవారు నాకు మాట్లాడటానికి అవకాశ మిచ్చినందులకు వారికి నా కృతజ్ఞత తెలుపుతూ, యింతటితో సెలవు తీసుకుంటున్నాను

MR. SPEAKER:—The House will now adjourn for lunch and meet, for the convenience of the members, at 3 p.m. We will sit for half an hour more in the evening i.e., till 5-30 p.m.

The House then adjourned for lunch.

AFTER LUNCH 3 P.M.

MR. SPEAKER:—The House will now resume discussion on the motion of thanks to the Governor.

*Sri R. B. Ramakrishna Raju:—అధ్యక్ష మహాశయా, మనము యీ దినము గవర్నరుగారి భాషణగురించి చర్చిస్తున్నాము. ఈభాషణ గవర్నరుగారి ముఖతా వెలువడినా కూడా, యిందులో ఉన్నవి ప్రభుత్వంవారి అభిప్రాయాలని మనకందరికి తెలిసినదే. మనము యిప్పుడు చేసేచర్చ కేవలము గవర్నరుగారినిగూర్చి చేసేచర్చ కాదనిన్నీ, గవర్నమెంటు వారి ఉద్దేశ్యాలు, వారి పాలసీలు మొదలైన వాటిని గురించిన చర్చ అనేదికూడా మనకందరికి తెలిసిన విషయమే. అందువల్ల మనము యిప్పుడు యీచర్చ ఏవిధంగా జరగవలసిందిన్నీ గుర్తిస్తే, దీన్నిగూర్చి విశేషంగా చర్చచేయవలసిన అవసరంలేదని నాఅభిప్రాయము. గవర్నమెంటు ఏర్పడి ఏ కొద్దిరోజులో అయింది. ఇప్పుడు మనకువున్న ఎనిమిదిమంది మంత్రులలోనూ యిద్దరు తప్ప మిగతావారు కొత్తవారు. ఇందులో శ్రీ N. V. Rama Rao గారు అస్వస్థతగా మద్రాసులో వున్నారు, వారు త్వరలో స్వస్థులై యిచ్చటికివచ్చి వారి కార్యభారము నిర్వహించగలరని మీ అందరితరఫున

(Sri R. B. Ramakrishna Raju) [25th April, 1955

ఆశిస్తున్నాను. మంత్రివర్గములో యిప్పుడువున్న వారిసంఖ్య యింతేనా, యింకా పెంచబడు తుందా, యింకా ఎవరెవరు వుంటారు, వారిశాఖలు ఏవేవి, అనే విషయాలు యింకా పూర్తిగా నిశ్చయింపబడినట్లు లేదు. ఇటువంటి సందర్భములలో మన గవర్నరుచేసిన ఉపన్యాసము అంతయు మన మంత్రులయొక్క పాలసీలు, వారియొక్క ఉద్దేశ్యాలు తెలియపరచేదా, లేకపోతే కేవలము మధ్యకాలములో గవర్నరుగారు చేసిన పనులను గురించి తెలుపుచున్నదా అని తెలుసుకోవలసి యున్నది. పాపము, ఈ గవర్నమెంటు ఏర్పడి కొద్దిరోజులే అయింది.

The Hon. Sri B. Gopala Reddi:—పాపం.

Sri R B. Ramakrishna Raju:—ఔను, పాపము! ఎందుకంటే, ఇంత త్వరగా యీసభను ఏర్పాటుచేయడము కూడా, ఒకవిధంగా వీరికి కష్టమేనని భావిస్తున్నాను. ఈమధ్య ముఖ్యమంత్రి గోపాలరెడ్డిగారు నాకు ఒకవుత్తరము వ్రాశారు. అందుకు నేను బదులు గూడా వ్రాశాను. అందులో "యిప్పుడు యీసభను ఏర్పాటుచేయడము మీకు కష్టమే, రాబోవు బడ్జటువిషయములో మీరందరు కొంత ఆలోచించుకోవలసి వుంటుంది, మీపాలిసీలు ఏమిటి, దేనిదేనికి ఎంతెంత డబ్బు కావలసివుంటుంది, మీ వుద్దేశ్యాలు ఏమిటి, మీ ప్రణాళికలు ఏమిటి, యివన్నీ ఆలోచించటానికి మీకు కొంతవ్యవధి కావలసి వుంటుంది గదా! ఇవన్నీ అవసరమే కాబట్టి, మీ యిష్టప్రకారము సభనుఏర్పాటు చేసుకోవచ్చును" అని వ్రాశాను. కాబట్టి యీ భాషణలో, ఏదో సూచనగా, కొన్ని కొన్ని రూల్సుప్రకారం విధిలేకుండా వుండవలసి వుంది కాబట్టి, వారు ఏవో కొన్ని విషయాలు చెప్పారు కాని, గవర్నమెంటువారి ఉద్దేశ్యములు సంపూర్ణంగా యిందులో పేర్కొనబడినవనిగాని, వాటిని గురించి విశేషంగా చర్చించవలసింది అనిగాని మనం అభిప్రాయపడడము చాలా పొరబాటు అని నా ఉద్దేశ్యము. గవర్నరుగారి భాషణలోని విషయములు చెప్పినంతవరకు సమంజసముగా వున్నవా, లేక పొరబాట్లు ఏమైనా వున్నవా అన్న విషయము చూస్తే చాలు అని నాఅభిప్రాయము. గవర్నమెంటువారు చేయవలసిన విషయాలు అనేకములున్నవి. అవి చక్కగా ఆలోచించి, వారు చేయగలిగినటువంటి వాటినన్ని టిని బడ్జటులో సమకూర్చి, వారు వుండగల యీ అయిదేండ్ల కాలవ్యవధిలోగా వారు ఏమేమి చేయగలరో అవన్నీగూడా బడ్జటుస్పీచ్‌లో విపులంగా చెబుతారని ఆశిస్తున్నాను. అయితే ఈసందర్భంలో ఒకవిషయము చెప్పవచ్చును. గవర్నమెంటువారి ఉద్దేశ్యాలు తెలియపరచి నప్పుడు వాట్నిగురించి చర్చ అవసరం లేదంటే, మీరు సవరణలు ఎందుకిచ్చారు అనేవిషయం రావచ్చును. త్వరలో బడ్జటు ఏర్పడుతుంది, బడ్జటుస్పీచ్ రాబోతుంది గనుక దేశాభివృద్ధి ననుసరించి ఏ ఏ ప్రణాళికలు అవసరమో అవి ఆలోచించేటప్పుడు సూచనప్రాయంగా నేనుచేసే సూచనలు ప్రభుత్వం గ్రహించవలసిందని చెప్పుటే నాసవరణల ఉద్దేశం. ఇక ఈవుపన్యాసముపై చర్చించేముందు ఒక point of order కూడ మన Communist సోదరుడు సుందరయ్యగారు లేవదీశారు. ఈ point of order లో పై ruling ఇవ్వబడినప్పటికిని ఎన్నికలగురించి చర్చించవచ్చునని నా అభిప్రాయము. Election commission వారు elections కు కావలసిన విధులను ఏర్పాటుచేసేవారు. అది వారికర్తవ్యంగా వున్నప్పటికీ కూడా వాటిని నడిపించింది మన గవర్నరుగారే. ఇవి చక్కగా నడిపించబడినవా, లేక అందులో

లోపాలున్నవా, మనకు ఏమైనా కష్టాలు ఏర్పడినవా అనే విషయాలు పరిశీలించి చూస్తే, మనకు ఏఒక్క కష్టంగాని రూల్సుకువిరుద్ధంగాని కనబడలేదు. కాని మన సోదరుడు సుందరయ్యగారు చెప్పిన విషయాలలో నేను ఏమాత్రం వారితో ఏకీభవించను నామటుకు నేను ప్రభుత్వంపార్టీలో చేరినవాణ్ణికాదు. నేను కాంగ్రెసులో లేకుండా, స్వతంత్రుడుగానె ఎలెక్షనులలో నిలిచి గెలుపొందాను. నేను ప్రభుత్వపార్టీలో లేనివాణ్ణి కాబట్టి, నేను చెప్పేమాటలు ప్రభుత్వ పక్షానికి సహాయకరంగా చెప్పడములేదు కాబట్టి నామాట మీరందరు సంపూర్ణంగా విశ్వసించాలి. నాకు తెలిసి నంతవరకు, మాచిత్తూరుజిల్లాలో ఎలెక్షనులకు సంబంధించినంతవరకు ఏవిధమైన అకృత్యముగాని, ఎవరివల్లనూ వత్తిడిగాని, ఆటంకములుగాని జరుగలేదు. నా ఎలెక్షను సక్రమంగా సవ్యంగా జరిగినది. ఇంకను నేను కాంగ్రెసుకు విరుద్ధంగానే ఎలెక్షను ప్రచారము చేశాను అటువంటప్పుడు గూడా కాంగ్రెసు మిత్రులవల్లగాని, అధికారులవల్లగాని, ఎవరివల్లనూ గూడా నాకెట్టి ఆటంకములు గాని కష్టములుగాని రాలేదు. ఇంతేకాకుండా నాకు పోటీగా Communist అభ్యర్థిగా శివయ్య అనేఆయన నిలబడ్డాడు. ఆయన నాకు చాలా మిత్రుడు. నాకు కావలసినవాడు. అతరుగూడా చెప్పగలడు. అతనికిగూడా ఏవిధమైన కష్టముగాని, ఆటంకముగాని రాలేదని నేను గట్టిగా చెప్పగలను, కాబట్టి ఎలెక్షనులు చాలా సక్రమంగాను, సవ్యంగాను జరిగినవేగాని, అన్యాయమేమి జరుగలేదు. ఇందుకు నిదర్శనము ఎలెక్షనులు జరిగి ఎన్నోరోజు లైనప్పటికిగూడా, యింతవరకు మన ఆంధ్రదేశమునుంచి ఒక election petition గూడా రాలేదు అని వింటున్నాను. అట్లా ఏమైనా వచ్చినవని నిరూపించగలిగితే, నేను నామాటను సవరించుకోటానికి సిద్ధంగావున్నాను. అందువల్ల ఎలెక్షనులు సక్రమంగా జరిగినవని చెప్పటానికి ఆక్షేపణ ఎంతమాత్రము వుండదు. గవర్నరుచెప్పిన అన్ని విషయాలగురించి, "నేను చాలాసంతోషిస్తున్నాను" అంటు దానిని అందరు సంపూర్ణముగా ఆమోదించవచ్చుననుకొంటాను. అందువల్ల వారికి మనఅభివందనలు తెలియపరచడములోతప్పేమీలేదు ఎటువంటి ఆక్షేపణ వుండటానికి చోటులేదు. అయితే గవర్నరుగారి భాషణకు అభివందనలు చెప్పటలోతప్పేమీలేదు, అన్ని విషయాలు ఒప్పుకోవచ్చునని చెప్పినప్పుడు, మీరు సవరణ ఎందుకుపెట్టారు అని నన్ను మీరు ప్రశ్నించవచ్చు. భాషణలోని సంగతులకు నేను ఒప్పుకుంటున్నప్పటికినీ, అందులో లోపాలు లేకపోలేదు. నేను ఒకేఒక సవరణ యిచ్చాను. గవర్నరు మన ఎలెక్షనులు జరిగే సందర్భములో చాలాశ్రద్ధగా పనిచేసి, ఎన్నికలు సక్రమంగా నడిపించి నిర్వహించాడు. గవర్నమెంటును సరియైన స్థితిలోవుంచి, యిప్పుడు మన మంత్రి వర్గము చేతులలో పెట్టారు. ఇకముందు యీప్రభుత్వాన్ని ఎలా నిర్వహించాలి అనేబాధ్యత, భారము అంతయు మన మంత్రులదే. కాబట్టి మన గవర్నరు యింతవరకు ఎంతో జాగ్రతతో, శ్రద్ధగా పరిపాలనను నిర్వహించినందులకు వారిని నేను అభినందించక తప్పదు. పంచవర్షప్రణాళికలు సక్రమంగాను, సవ్యంగాను జరపటానికిగాను బ్రహ్మాండమైన పుస్తకాలు అచ్చువేయించి, గ్రామగ్రామాలకు పంపించి ప్రజలకు పంచిపెట్టించారు. అందులో ప్రజలు ప్లానువిషయములో ఎట్లానడుచుకోవాలి అనే instructions విపులీకరించి ప్రజలకు సహాయపడ్డారు. ప్లాను తేదీలతో సహా ఫలానాఅప్పుడు ఫలానాపని జరగాలి, అంటూ దేశమంతటా జిల్లా ప్లానులు, తాలూకా ప్లానులు ఎప్పుడెప్పుడు ఏవేవి కావలసిందిన్నీ అచ్చువేయించి అందజేసింది మన గవర్నరుగారే. వారు యింతశ్రద్ధగా పనిచేసినందుకు వారిని అభినందించడములో తప్పేమీలేదు. వారికి మనయొక్క కృతజ్ఞతను తెలుపవలసిన బాధ్యత మనమీద వున్నదని నేను విశ్వసిస్తున్నాను.

(Sri R. B. Ramakrishna Raju) [25th April, 1955

ఇక నాసవరణ విషయములో నేనొకమాట చెప్పదలచాను. గవర్నరుగారి భాషణలో ఎక్కడచూచినా "My Government" "My Gove.nment" అని వ్రాయబడుతున్నది. అంటే "నాగవర్నమెంటు" అన్నమాట. అయితే యిప్పుడు యిది "ప్రజాస్వామిక ప్రభుత్వమా", "నియంతృత్వ ప్రభుత్వమా" అనే సందేహము కలిగింది. ఈమాటలు యిప్పటికి 6½ సంవత్సరములుగా, నేను యిదివరకు మద్రాసులో Legislative Council Chairman గా వున్నప్పటినుండి, వింటూంటే చాలా బాధపడేవాణ్ణి. మరల యిక్కడగూడ యివే మాటలు వినబడుచున్నవి. ఈ "My Government" అనేపదము యిదివరకు ప్రాచీనకాలంలో బ్రిటిషురాజ్యములో ప్రభువు దైవాంశసంభూతుడనే అభిప్రాయాన్ని అనుసరించి యీపదము ఉపయోగించ బడుతూండేది. ఇంకను సీమలో ప్రభువు దైవాంశసంభూతుడు అని, ఆయనకు వంశ పరంపరగా రాజ్యానికి హక్కువుండడముచేత, ఆయన ప్రభువుగనుక ఆయన విషయములో యీ పదము వుపయోగించతము కద్దు. ఆయన ఒక్కడే అక్కడ రాజ్యము నిర్వహించక పోయినప్పటికినీ, మంత్రులు, ప్రజలచేత నియమింపబడిన వారైనా కూడా, ప్రభువే వారిని ఏర్పాటుచేసినట్లునూ, King's Government అనే అభిప్రాయముతో, ప్రభువు అక్కడికి వచ్చినప్పుడు "My Government" అని చెప్పుట వాడుక అయినది,

అదేవిధంగా మనంకూడా "My Government" అని చెప్పవలసిన కారణం యేమిటి? 'నావిష్ణుః పృథివీపతిః' అనేది పాతకాలంనాటి మాట ఇప్పుడు విష్ణువులేదు, పృధివిలేదు. రాజులు దైవాంశసంభూతులనే రోజులు మాదిరిగా యిప్పటికీ గవర్నరుగారు 'నాగవర్నమెంటు' అనడం బాగులేదు. మన రాజ్యాంగచట్టం ఏర్పడిన తరువాత 'మన గవర్నమెంటు' అని చెప్పడం మీకు, మాకుగూడా గౌరవప్రదం అని నాఅభిప్రాయం. ఈ చిన్నవిషయం ముఖ్యంగా ఆమోదించినట్లయితే యీ సవరణతో గవర్నరుగారి భాషణపైన అభినందన తీర్మానమును మనం ఆమోదించవచ్చు. రెండోది చాలా ఆందోళన కలిగించే విషయం. 10 రూపాయలలోపు శిస్తు రద్దువిషయం ప్రస్తుతానికి నిలిపేశాము అన్నప్పుడు నిరాశ, ఆశాభంగం కలుగచేస్తుంది. వ్యక్తిగతంగా నాకు ఆశాభావంవుంది. కేవలం పదిరూపాయల శిస్తు రద్దువల్ల గొప్పలాభం ఒరుగుతుందనిగాని రైతులు చాలా బాధపడుచున్నారనిగాని చెప్పడంలేదు. ఈప్రభుత్వంలో గత ప్రభుత్వం తాలూకు సంజీవి రెడ్డిగారు, సంజీవయ్యగారు - రెండు సంజీవులు - వున్నారు. ప్రాణాలుపోకుండా వారు రైతులను కాపాడవచ్చు. ఈ పదిరూపాయల శిస్తు మాఫీగురించి నేను విన్నప్పుడు ఒక సంవత్సరం మాత్రం రద్దుచేస్తారేమో అనుకొంటిని. సంపూర్ణంగా land revenue తీసివేస్తారని తెలిసినప్పుడు చాలా ఆశ్చర్యపడితిని. ఎందుకంటే, యిందులో ఒకగొప్ప సూత్రమున్నది. నావుద్దేశంలో పీటితీరువ అనేది, land revenue అనేది వుండకూడదు. అందరికీ income-tax వేయాలి. ఆదాయం మీద tax వేయాలి. భూమి దున్నినంత మాత్రాన తీరువ కట్టవలసిన అవసరంలేదని నాఅభిప్రాయం. సంవత్సరానికి వచ్చిన వరుంబడిపై tax వేయాలి. మిగతా వృత్తులవారికి సంవత్సరానికి రు. 4,000 వరుంబడివరకు పన్నులేదు. అదేవిధంగా భూమిదున్నేవారికి ఒకసంవత్సరం పండి మరొక సంవత్సరం పండదు కనుక వచ్చే ఆదాయాలపైననే పన్ను వేయాలి. మినిష్టరుగారయినా సరే ఎవరయినా సరే నిష్కర్షగా నిష్పక్షపాతంగా యోచిస్తే నారిగ్రామాల్లో కష్టాలులేని రైతులు లేరనీ, అటువంటి రైతులపై తీరువవేయడం అన్యాయం అని అంగీకరిస్తారు. వ్యవసాయం చేసు

కొనే వారిపైకూడ వ్యవసాయమునకయిన ఖర్చులుపోగా మిగిలిన వరుంబడిపైన ఆదాయపుపన్ను వేయవలసి యున్నది అని నాయొక్క అభిప్రాయం. చిన్నచిన్న రైతులను విడిచిపెట్టాలి. ఈ అభిప్రాయాన్ననుసరించి వచ్చేబడ్జెటులో తగినమార్పులు చేయుదురని ఆశించుచున్నాను దేశాన్ని సోషలిస్టు వ్యవస్థగా మారుస్తామన్న ఆశయం సంతోషించతగ్గది. ఈమార్పు చాలా అవసరం. P.S.P. అయినా K L P అయినా కమ్యూనిష్టులయినా యీ ఆశయంతో సహకరించగలరని నమ్ముతున్నాను. నామట్టుకు నేను అందుకు సహాయంచేయగలనని తెలియజేస్తున్నాను. తరువాత, మన గవర్నరుగారి భాషణలో గొప్పగొప్ప ప్రాజెక్టులను కడుతున్నారని చెప్పారు. కట్టవలసినదే. మాకు సంతోషమే. మాచిత్తూరు జిల్లాలోను - మాచిత్తూరు జిల్లావలెనే శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాల్లోను నేను చూచినంతవరకు - ప్రజలు పంటలకు వర్షములమీద ఆధారపడుతున్నారు. అదైవ మాతృకలని, దైవమాతృకలని భూములు రెండురకాలు. దైవమాతృకలు దేవుడిచ్చే వర్షంపైన ఆధారపడేవి, అదైవమాతృకలనగా వర్షంతో నిమిత్తంలేనివి. మాచిత్తూరుజిల్లా, విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలు దైవమాతృకలు. వంశధార, నందికొండ, తుంగభద్ర ఎగువకాలువలకు 2, 3 వందలకోట్లు ఖర్చుపెడతామని చెప్పినందుకు సంతోషిస్తూ, చిన్నచిన్న ప్రాజెక్టుల విషయం అశ్రద్ధచేయరాదని మనవి చేస్తున్నాను. జమీందారీలను ప్రభుత్వం తీసుకున్న తరువాత చెరువుల మరమ్మతు వెనుకపడింది. అందుచేత పెద్దప్రాజెక్టులతోపాటు చెరువుల మరమ్మతుకూడా చేస్తే యీస్టేటులో సమస్తప్రజలకు ఉపకారం జరుగుతుందని, యీవిషయాలు వచ్చేబడ్జెటులో యోచించి ముఖ్యమైన యీసూచనలను గమనించి తగుమైన ఏర్పాటుచేయుగలరని ఆశిస్తున్నాను.

Minor irrigation projects కట్టుటకు గాను 10 కోట్లరూపాయిలు కేటాయించారు. కాని details యివ్వలేదు. ఒకజిల్లావారు మాకేమి చేసినారని అడిగితే, యింకొకజిల్లాలో పనులు ముగించుకొని వస్తామంటే లాభములేదు. 10 కోట్లు కాకుండా 11 కోట్లు కేటాయించి ప్రతి జిల్లాకు కోటి రూపాయల చొప్పున ఖర్చుపెట్టి చిన్నచిన్న ప్రాజెక్టులు కట్టితే మీ పేరు, మీ కీర్తి శాశ్వతముగా వుంటవి. ఇది special గా planning మంత్రిగారికి చేసేవినతి. జమీందారీ యిలాకా లోని రైతులు చాల బాధలు పడుతున్నారు. ప్రభుత్వము జమీనులను తీసికొన్నది. ఈ జమీందారి యిలాకాలోని ప్రజలు తగిన సదుపాయాలులేక, జీవయాత్రకు కావలసిన సామాన్యసౌకర్యాలు కూడ లేకుండ బాధపడుతున్నారు. అలాంటి సందర్భములో జమీందారి యిలాకాలోని వారిని గవర్నమెంటు యిలాకాలోని వారితో సరిపోల్చి చూచుట సమంజసముకాదు. జమీందారీ యిలాకా వారికి ప్రత్యేక సౌకర్యాలు కలుగజేయవలెను, వారు త్రాగుటకు నీళ్లులేని పరిస్థితిలోవుంటే బావులు త్రవ్వడానికి అయ్యే ఖర్చులో వారు సగముయివ్వాలని కోరడము న్యాయముకాదు. గ్రామ ప్రజలకు ముఖ్యంగా కావలసినది రోడ్లు. రోడ్లుఅంటే కంకర రోడ్లు కాకపోయినా గ్రామ గ్రామమునకు రానుపోను తగిన బాటలైనా వుండవలెను, ఈవిషయాన్ని మన ప్లానింగు మంత్రిగారు గమనించి జమీందారీ area లో special గా ఇటువంటి సౌకర్యాలను ఏర్పాటుచేస్తారని వారిని ప్రార్థిస్తున్నాను. తరువాత మునిసిపాలిటీలలో నీటి సౌకర్యాలకుగాను కోటిరూపాయలు ఏర్పాటుచేశామని గవర్నర్‌గారు తమ ప్రసంగములో చెప్పారు. ఐతే గ్రామాలలోకూడా నీటి సౌకర్యాలకుగాను ఏర్పాట్లు జరుగవలసి ఉన్నదని ప్రభుత్వమువారు గమనించవలెను. గ్రామాలలో నీటి సౌకర్యాలు మునిసిపాలిటీలలోకంటె అధ్వాన్నముగావున్నాయి. మునిసిపాలిటీలలో కూడ నీటి సౌకర్యాలేమంత

బాగుగలేవు. తిరుపతిలో జనాభా విశేషముగా పెరుగుతున్నది. ఆ పట్టణములో ఇప్పుడుండే నీటి సౌకర్యాలు చాలవు. పట్టణాలతోబాటు గ్రామాలలోను పంచాయితీలలోను ప్రత్యేక నీటి సౌకర్యాలు చేయడానికి తగిన ఏర్పాటులుచేసి వాటికి కావలసిన ధనము కేటాయింపుచేస్తారని ఆశిస్తున్నాను. ఇక scheduled castes కు. tribes కు ప్రత్యేకమైన అసౌకర్యాలు బాధలు వున్నాయి. ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో scheduled castes కుగాను కోటి రూపాయలు కేటాయించామని చెప్పారు. ఆ కోటి రూపాయలు ఏలా ఖర్చుఐందో నాకు తెలియదు. సంజీవయ్య గారికి తెలుసు. ఒక కోటి ఖర్చుచేసి కూడా మాజిల్లాలో మాగ్రామానికి ఏమి సౌకర్యాలు చేయించినది చూడలేదు.

The Hon Sri B. Gopala Reddi:—పోయిన సంవత్సరము 76 లక్షల రూపాయలు ఖర్చు అయింది.

The Hon. Sri Kala Venkata Rao:—ఇప్పటికి 270 లక్షలు ఖర్చుఅయింది. ఈ సంవత్సరము 60 లక్షలు కేటాయించబడింది.

Sri R B. Ramakrishna Raju:—70 కోట్లు ఖర్చు పెట్టమని నా ఉద్దేశము. నేను పోయినచోట్ల డబ్బు ఏప్రకారంగా ఖర్చుపెట్టారో గ్రామాలలో కనబడనే కనబడదు. మీరు యెంత ఎక్కడ ఖర్చుచేశారో చెప్పవలసివుంటుంది. నా నియోజకవర్గ గ్రామాలలో తిరిగినాను. ప్రతి గ్రామములోను నీళ్లులేవు. ఖర్చుచేశామంటే ఏమిలాభము? ఎట్లా ఖర్చుచేశారు? మా జిల్లా గ్రామాలలో తిరగండి. నీటి సౌకర్యాలు చేయించమని అడుగుతున్నాను. డబ్బు ఖర్చుపెట్టింది ఎక్కడ?

MR. SPEAKER:—The hon. Member will please address the Chair.

Sri R. B. Ramakrishna Raju:—I am sorry, Sir. I was giving that advice to my friend, but I forgot it myself. (laughter). ఇప్పుడు schedule castes దగ్గరపోయి మనఉద్దేశాలు చెప్పేటప్పుడు వాండ్లు అడిగేప్రశ్నలకు జవాబు చెప్పలేక పోతున్నాము. మాకు ఏమిచేశారని అడుగుతారు. వాండ్లతో మాట్లాడుట చాల కష్టము. మీకు కూడ యీ అనుభవముంటుంది. ప్రతివారు అనుభవించారు. ఎన్నికలలో కమ్యూనిస్టుల ప్రచారంవల్ల హరిజనులు మోసపోకుండా చేయడానికి ఎంత బాధపడినామో మనకు తెలుసు. అరచేతిలో వైకుంఠము చూపిస్తామనే కమ్యూనిస్టు ప్రచారానికి హరిజనులు లోనుకాకుండా చేయడానికి మనము ఎన్ని బాధలుపడింది తెలుసు సామాన్యమైన యీ చిన్న విషయాలగురించి శ్రద్ధవహించి వారలకు కావలసిన సౌకర్యాలుచేస్తే బాగుంటుందని నా ఉద్దేశము.

Sri A. Kaleswara Rao:—మాననీయ అధ్యక్షా, శ్రీ రాజేశ్వరరావు గారు, ఇతర గౌరవసభ్యులు సెలవిచ్చినట్లు గవర్నరుగారి ప్రసంగం ప్రస్తుత ప్రభుత్వముయొక్క అభిప్రాయాలను తెలుపుతున్నది. ఇది సాంప్రదాయం అని మనకందరికి తెలిసినదే. కాని మంత్రివర్గం వారు సెలవిచ్చినట్లు, కొద్దిరోజుల క్రితమే వారు అధికారంలోనికి వచ్చినారు. వారు పాలసీలను నిర్ణయించడానికి కార్యక్రమం వేయడానికి తగిన అవకాశం లేకపోయింది. జూన్‌నెల మధ్య

25th April, 1955] (Sri A. Kaleswara Rao)

భాగంలో కర్నూలు వస్తాముఅని అందరమూ అనుకున్నాము. ఆకస్మికంగా ఏప్రెలు 22 వ తేదిన అసెంబ్లీసమావేశం అవుతుందని ప్రకటింపబడేవరకు మాకు ఎవరికి తెలియదు. గవర్నరుగారి address అంటే ఇప్పటివరకువున్న ముఖ్యమైన విషయాలు క్రోడీకరించి తయారు చేయబడు తుంది. ఇందులోదైనందిన పరిపాలనకు సంబంధించిన ప్రతివిషయం, ప్రతిజిల్లాకు సంబంధించి నవి, ప్రతిమునిసిపాలిటీకి సంబంధించినవి లేవు అని అందుకు విచారం తెలియచేయ నక్కర లేదు. గవర్నరుగారి address వున్నంతవరకు ఆకర్షణీయంగా ముఖ్యమైన విషయాలు గురించి చక్కగా విపులంగా చెబుతోంటా, లేదా అనే విషయం గమనించాలి. నాఅభిప్రాయం చక్కగా చెబు తుందనే. అందులో ఇప్పుడుప్రపంచంలో హిందూదేశానికి ప్రఖ్యాతిగల ఒకవిషయం ఉన్నది. సోవి యట్ రష్యాలో 1917 లో రెవల్యూషనువస్తె 1934 వరకు పంచవర్షప్రణాళిక ఏర్పడలేదు. స్టాలిను వచ్చి పంచవర్షప్రణాళికను పెట్టినాడు. సోవియట్ రష్యాకు ఖ్యాతివచ్చింది దానివల్లనే. మనంకూడా సోషలిస్టుసమాజ స్థాపనకే పూనుకున్నాము. మనం 1947 లోనే స్వాతంత్రం తెచ్చుకున్నప్పటికి ప్రథమ పంచవర్షప్రణాళికను, ద్వితీయ పంచవర్షప్రణాళికను ఏర్పాటుచేసుకున్నాం. ఇవి అన్నీ మహత్కార్యాలు. ఇతర దేశాలనుంచి వచ్చి చూసేవారు హిందూదేశం అభివృద్ధి చెందుతోందని ప్రశంసిస్తున్నారు. మనం చేస్తున్నదంతా సామ్యవాద సమాజస్థాపనకే; capitalist countries లో ఇటువంటి ప్లానింగువుండదు. అక్కడ ఆర్థికవ్యవస్థ వ్యక్తులచేతుల్లో వుంటుంది. ఇక్కడ ప్రభుత్వం అన్నీ తీసుకుంటుంది. ప్రతిపాలసీ ఆరోగ్యం, విద్య, వైద్య అన్నీ ప్రభుత్వంచేతుల్లో వుంటాయి, వాటినిగురించి గవర్నరుగారి address లో వుండడం చాలా ప్రశంసనీయంగా వున్నది. సుందరయ్యగారు విశాలాంధ్ర విషయం చెప్పారు. వారు చెప్పినదానితో నేను పూర్తిగా ఏకీభవి స్తాను. ఆంధ్రరాష్ట్రం వచ్చింది కాని మనకోరిక పూర్తికాలేదు. విశాలాంధ్రవస్తేనే మనకు సర్వ సౌకర్యాలు వస్తాయి. ఆంధ్రజాతికి తగ్గ పేరు ప్రతిష్ఠలు వుంటాయి. ఆంధ్రరాష్ట్రం పారిశ్రామికంగా అభివృద్ధి చెందలేదు. చాలా గొప్పనదులు వున్నాయి. రుషికుల్య మొదలుకొని స్వర్ణముఖి వరకు అనేకనదులు వున్నాయి. మనది వ్యవసాయిక భూభాగం అందువల్ల మనకు irrigation projects, Hydro electric projects ముఖ్యమైనవి. వాటివిషయంలో చాలా పనిచేశారు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పటినుంచి సంజీవరెడ్డిగారు ఉప ముఖ్యమంత్రిగావుండి చేసిన కృషిని అభి నందిస్తున్నాను. మాచ్ ఖండ్, నందికొండ, తుంగభద్ర హైలెవెల్ ఛానల్ ఇవన్నీ తీసుకువచ్చారు, తరువాత అనేక చిన్నచిన్న ప్రాజెక్టులు తీసుకువచ్చారు. నందికొండ విషయంలో పెద్దచరిత్రవున్నది. ఇంతవరకు స్వాతంత్రం వచ్చినాక మనకు ఒక ఇరిగేషన్ ప్రాజెక్టులేదు. విశాలాంధ్రవుంటే సత్వ రంగా వచ్చివుండేవి. మొట్టమొదట రామపాదసాగరం వచ్చింది. తరువాత కృష్ణా పెన్నారు వచ్చింది. దానిక్రింద కృష్ణానదీజలాలు చెంగల్పట్టు, ఉత్తరఆర్కాడు జిల్లాలకు తీసుకునివెళ్లే ప్రయత్నం జరిగిందని ఆందోళన లేవదీయడం జరిగింది. తరువాత నందికొండ వచ్చింది. ఇది విశాలాంధ్ర ప్రాజెక్టు అని నేను మనవిచేయుచున్నాను. కృష్ణా, గోదావరి, శబరి ఇవన్నీ మనకు వారికి సరిహద్దులు, ఒకే గవర్నమెంటు లేకపోవడంవల్ల అన్నీ ఆలస్యం అవుతున్నాయి. ఈ ప్రాజెక్టు దక్షిణహిందూదేశంలో పెద్దదిమాత్రమే కాకుండా ప్రపంచంలోనే పెద్దదని నావిశ్వాసం. 85 లక్షల ఎకరాలవరకు సాగులోనికి వస్తుందని విన్నాను. కాబట్టి యిది ప్రపంచంలోనే పెద్దప్రాజెక్టు అవుతుంది. దానిని తీసుకువచ్చినందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. విశాలాంధ్రగురించి

(Sri A. Kaleswara Rao) [25th April, 1955

ఎందుకుచెప్పలేదు అంటున్నారు. ఇప్పుడు చెప్పవలసింది ఏమివున్నది? ఆంధ్రగవర్నమెంటు, ఆంధ్రలోని అన్ని రాజకీయ పక్షాలు ఎట్టి అభిప్రాయభేదం లేకుండా విశాలాంధ్ర కావాలని కోరాం. తెలంగాణాలో $\frac{3}{4}$ వంతులు విశాలాంధ్రకు అనుకూలంగా వున్నారు. $\frac{1}{4}$ వంతుమాత్రం తెలంగాణా వేరేవుండాలి అనిఅన్నారు. చాందా, బస్తరు, ఒరిస్సా ఆంధ్రులు, మైసూరుఆంధ్రులు అందరూ విశాలాంధ్రకోరారు. కాని ఒక్క తెలంగాణా కోరలేదు. సాక్ష్యం ఇవ్వడానికి నేనూ ఫజిల్‌అలీ కమీషనువారి దగ్గరకువెళ్లాను. ఫజిల్‌అలీ కమీషన్‌రిపోర్టు జూన్‌నెలాఖరుకు వస్తుంది అనుకుంటున్నాను. రాకపోతే ఏమిచేయాలో తరువాత చూద్దాం. ప్రకాశం, సంజీవరెడ్డిగార్లు - అందరు ఆంధ్ర నాయకులు విశాలాంధ్రకు commit అయినవారే. కమ్యూనిష్టుపార్టీకన్న తీవ్రంగానేవిశాలాంధ్ర గురించి చెప్పాము. విశ్వవిద్యాలయాలలో తెలుగుపెట్టాలనే విషయంలో, పరిపాలన తెలుగులో జరగాలనే విషయంలో అభిప్రాయభేదాలులేవు. వీటివల్ల అసంతృప్తి తెలియజేయవలసిన పని లేదు. Land reforms గురించి పెద్దగాచెప్పారు. సోషలిష్టుపార్టీవారు ఈనాములు గురించి చెప్పారు. చాలా పెద్దచిక్కులతో కూడుకున్న legislation ఇది. వాటిని తప్పకుండా చేస్తారు. కమిటీవారు విచారిస్తున్నారు; వారి రిపోర్టు వచ్చినతరువాత legislation చేయవచ్చు. నేను urban municipality మంచివచ్చిన సభ్యుణ్ణి. ఇంతసంపూర్ణంగా municipal members ఒకరిద్దరు వున్నారేమో నాకు తెలియదు. విజయవాడ మనకు cultural and political capitalగావుంటున్న పట్టణం. కాని అక్కడదోమలు ఎక్కువగాఉన్నాయి. నీళ్లుకూడా ఇపుడు కొరతగా వున్నాయి. విజయవాడ మురికినీటి పారుదలస్కీము విషమై శ్రద్ధతీసుకోవాలని కోరుతున్నాను. బందరురేవును అభివృద్ధిచేస్తాము అంటున్నారు. చాలా సంతోషం. ఇంకా అనేక minor ports వృద్ధిచేయాలని కోరుతున్నాం. హరిజనులకు ఇండ్లస్థలాలు ఇస్తాముఅని సూచించారు. కొంతమంది గవర్నమెంటు పోరంబోకులు ఆక్రమించుకున్నారు. పట్టాలు ఇవ్వడానికి కొంతమంది దగ్గర డబ్బుతీసుకున్నారు. వీళ్లకు పట్టాలు ఇవ్వడంలేదు. ముఖ్యంగా urban areas లో ఇటువంటివి చాలా వున్నాయి. Labour co-operative societies ఇక్కడ పనిచేయడం లేదు. రైతులకు సక్రమమైన వడ్డీలపై అప్పులు ఇచ్చుటకు సహకారసంఘాలు ఉన్నప్పటికి సక్రమంగా పనిచేయుటలేదు. Labourer co-operative societies స్థాపించే విషయంలో ప్రత్యేకశ్రద్ధ వహించాలని సహకారశాఖ మంత్రిగారిని కోరుతున్నాను.

డాక్టరు లక్ష్మీపతిగారి యాజమాన్యంక్రింద పనిచేసిన ఆయుర్వేద కమిటీరిపోర్టు ప్రభుత్వం వారు జాగ్రత్తగా పరిశీలించాలని కోరుతున్నాను. అన్ని విషయాలలోను ప్రధానమంత్రి, ఆర్థిక మంత్రి అయిన గోపాలరెడ్డిగారు బడ్జెటు సెషనులో చెబుతారు. అప్పుడు మనం ఇంకా చెప్పడానికి అవకాశముంటుంది.

పదిరూపాయల శిస్తు మాఫ్ చేశామన్నప్పుడు, చాలా ఆశ్చర్యపడ్డాను. నేను సంతోషించి పత్రికలవారిని అభినందించలేదు. ఎందువల్లనంటే ఏ గవర్నమెంటైనా బడ్జెటును గమనక కుదుర్చుకొన లేకపోతే, ఆ గవర్నమెంటు చిరకాలము ఉండలేదని శ్రీరామకృష్ణరాజుగారు వెలవిచ్చింది నిజమే. Uneconomic holdings కు పన్ను అక్కరలేదనే సిద్ధాంతమున్నది. నేను అట్లా బి. ఏ. లో చదివాను. అయితే agricultural income-tax వేసి దానికి తగినటువంటి

[25th April, 1955 (Sri A Kaleswara Rao)

అదాతెచ్చి income సరిజేస్తేనే అది సరిపోతుంది, కాని ఒవేది చేయకుండా పదిరూపాయల శిస్తు మాఫ్ చేయడమనే టటువంటిది చాలా పొరపాటు. పజ్‌లాలీ కమీషన్ దగ్గరకు వచ్చినప్పుడు, "మా బడ్జెట్ ఎట్లా కుదుర్చుకొంటున్నారు" అని అడిగారు. వాంఛూగారు వచ్చినప్పుడు 5 కోట్లు లోటుఉంటే, విశ్వనాథంగారు 3 కోట్లకు దింపారు ఈ బడ్జెట్ విషయం వారు ఎందుకు అడిగారంటే తెలంగాణా బడ్జెట్ సరిపోదు అని, అది ఆర్థికంగా నిర్వహింపగలిగిన రాష్ట్రముకాదు అని చెప్పామ. అయితే విశాలాంధ్రలో ఎట్లాచేస్తారు మీ బడ్జెటు అని అడిగారు. కనుక బడ్జెటు విషయములో మీరందరు తోడ్పడి దానిని కుదర్చవలసిన అవసరమున్నది అది సరిగా కుదిరి-దంటే ఈ పదిరూపాయిలేకాదు ఇంకా ఎక్కువగా మాఫీచేయవచ్చు. ఇప్పుడైనా ఈ పదిరూపాయల శిస్తు మినహాయింపు postpone చేస్తున్నామని అన్నారేగాని. అట్లే ఉంచుతామని చెప్పలేదు. మన ఆర్థిక పరిస్థితిని కుదుర్చుకొనేంతవరకే ఈ విధంగా చేయవలసి యుంటుంది. కనుక, దీనిని సభ్యులందరు అంగీకరించ వలసియున్నది ప్రభుత్వము ఈ విధంగా ఇప్పుడు చేయక తప్పదు. కనుకనే ధైర్యంగా శిస్తు మినహాయింపు రద్దును తీసుకువచ్చింది. ఇప్పుడు 148 మంది కాంగ్రెస్ సభ్యులున్నటువంటి ప్రభుత్వము ఈ మాత్రంపని ధైర్యంగా చేయలేకపోతే, ప్రజలకు సరియైనటువంటి lead ఇవ్వలేకపోతే ఎట్లాగుఅంటున్నాను. The Government is not worth anything ఇదికూడ కేవలం బడ్జెటులోటును పూర్తిచేసుకొనేందుకు చేయబడినదేగాని మరేమికాదు. కనుక సభ్యులందరు దీనిని అంగీకరించవలెనని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri Pragada Kotaiah.—అధ్యక్షా, ఆంధ్రప్రజలను చాలాకాలంగా కలవరపెడుతున్నటువంటి నందికొండ ప్రాజెక్టు, వంశధార ప్రాజెక్టు, తుంగభద్ర ఎగువకాలువ విషయంలో 4, 5 మాసాలుగా గవర్నరు, అంతకు పూర్వము ఉన్నటువంటి ప్రభుత్వము శ్రద్ధతీసుకొని, వీటిని ఒక నిర్మాణదశకు తీసుకొని వచ్చుటకు సహాయపడినందుకు ఆంధ్రప్రజలందరు కూడ హర్షిస్తారనుటలో సందేహంలేదు. కాని ఒక విషయంలో కొంత బాధ కలుగుతున్నది. సన్నకారు రైతులకు పదిరూపాయిల శిస్తు భారాన్ని తొలగిస్తామని, ప్రజలు అడుగక పూర్వమే, పాతప్రభుత్వము నిర్ణయం చేసింది. ఈ నిర్ణయాన్ని అమలు జరుపడంలో చాలా చిక్కుసమస్యలు ఉన్నమాట నిజమే. ఆర్థికంగా లోటు ఉన్న ఈ రాష్ట్రంలో ఇప్పుడు వెను వెంటనే సన్నకారు రైతులకు ఆ సౌకర్యాన్ని కలిగించడానికి సావకాశమున్నాదా, లేదా అని ఆలోచించినప్పుడు, లేదు అనే సమాధానం వస్తుంది. దానిలో సందేహంలేదు. కాని అంత మాత్రంచేత, ప్రత్యేక పరిస్థితులలో పోయిన కాంగ్రెస్ ప్రభుత్వము చేసిన నిర్ణయాన్ని ఈ కాంగ్రెస్ ప్రభుత్వం వెనుకపెట్టడం అంత సరికాదు. అందువల్ల ఆనిర్ణయాన్ని అమలు పర్చడంలో వచ్చే లోటును భర్తీచేసుకోడానికి అవసరమైనటువంటి సూచనలుకూడ ఈ సభ ముందు పెట్టి, ఈ సభవారి ఆమోదమపొంది, సన్నకారు రైతులకు తప్పకుండా ఆకొద్దిపాటి సౌకర్యము నైనా కలుగచేయడానికి పూనుకోవలెనని నేను విజ్ఞప్తిచేస్తున్నాను.

చేనేత పరిశ్రమను గూర్చి గవర్నరుగారి ప్రసంగంలో ఒక చిన్న para ఉన్నది. ఇందులో 53-54, 54-55 సంవత్సరాలకు చేనేత పరిశ్రమాభివృద్ధికై 30 లక్షలరూపాయలు ఇండియా ప్రభుత్వము ఇచ్చినట్లు చెప్పబడినది. అందులోనుంచి ఈ రెండు సంవత్సరములు

(Sri Pragada Kotaiah) [25th April, 1955

కాలములో 59 లక్షల రూపాయలు మాత్రమే ఖర్చు చేయబడింది, 20 లక్షలు మిగిలిపోయింది. అసలు ఈ 80 లక్షల రూపాయలు ఏవిధముగా ఖర్చు పెట్టబడుతున్నది ఆలోచించవలసి యున్నది. ఇందులో నూటికి 80 వంతులు అప్పులుగా ఇవ్వబడుతున్నదేగాని, బయట ప్రచారం సాగుతున్నట్లు సరాసరి చేనేతవారికి ఏదో విరాళాలుగా ఇవ్వబడుతున్నది కాదు. ఇవి సహకార సంఘాలకు అప్పులుగానో లేదా, నూలుమిల్లులకు అప్పుగానో, లేదా బట్టల అమ్మకంలో rebate గానో ఇవ్వబడుతున్నది. అందువల్ల సహకార సంఘాలలో చేరిన కొద్దిమందికి మాత్రమే దీనివల్ల ప్రయోజనం కలుగుచున్నది కాని సహకార సంఘాలకు ఈ cess ప్రణాళికలవల్ల కలిగే ప్రయోజనం లేదు. ఈ విషయాన్ని ప్రభుత్వదృష్టికి గత రెండు సంవత్సరాలుగా తీసుకువస్తున్నప్పటికి ప్రభుత్వ విధానంలో మార్పు కన్పించడంలేదు. ఈ ప్రభుత్వము తమ విధానాలనుగూర్చి భయపడవలసిన అవసరంలేదు. ఎందుకనగా, అన్ని రంగాలలో సాధించవలసినటువంటి అభివృద్ధి కార్యక్రమాలు, ఏమిటో స్పష్టంగా నిర్వచించినమీదటే ఈపార్టీ ఎన్నికల్లో నిలబడడం, ప్రజల అభిమతాన్ని చూరగొనడం అధిక సంఖ్యాకులుగా ఈ శాసనసభను అలంకరించడం జరిగింది. మన manifesto లో చేనేత పరిశ్రమను గురించి రెండు మూడు విషయములు స్పష్టంగా చెప్పాము. చేనేత పరిశ్రమకు బట్టల యంత్రాల పోటీనుంచి రక్షణకల్పించుటకై చేనేతకు చీరలు, ధోవతులు కేటాయించడానికి ఈ ప్రభుత్వం కృషి చేస్తుందని చెప్పబడింది. రెండవది బట్టల యంత్రాలవారికి నూలు చాలా సరసంగా గిట్టుబాటు అవుతున్నది. కాని చేనేతవారికి నూలు కావాలంటె, చాలా ఖర్చులు లాభాలు చేర్చబడుతున్నాయి. మిల్లులకు గిట్టేధరలకు చేనేతవారికి గిట్టేధరలకు ఒక నూలు లోనే నూటికి 25 రూపాయలుతేడా కన్పిస్తున్నది, ఈ తేడా తగ్గించడానికి చేనేత పారిశ్రామికులు చాలాకాలంగా ఒక సూచనచేస్తున్నారు. గ్రామాలలో అనువైన అభివృద్ధికరమైన చిన్న చిన్న పడుకు సాధనలు ప్రవేశపెట్టి చేనేతవారికి సరసంగా అందేటట్లు చూడవలసిందని కోరారు. ఇదికూడ ఎన్నికలలో బాహాటంగా చెప్పడమేకాకుండా మన manifesto లో అంగీకరించిన విషయం కనుక ఈరెండు విషయాలు గురించి మన ప్రభుత్వము తగిన శ్రద్ధతీసుకొంటుందని నేను ఆశిస్తున్నాను.

అన్నిటికంటె ప్రధానమైన మరొక విషయమున్నది. ప్రభుత్వంచేతులో ఆరుమాసాలుగా విశ్వానంద కనుంగో కమిటీరిపోర్టు (Textile Enquiry Committee) ఒకటి ఉన్నది. ఆ రిపోర్టులో ప్రమాదకరమైనటువంటి సూచనలున్నవి. బట్టలయంత్రాలు ఒకప్రక్కన, చేతి మగ్గాలు ఒకప్రక్కన బ్రతకడానికి అనువైన మార్గాలను సూచించవలసిందని ఇండియాప్రభుత్వము కోరి ఆ కమిటీని నియమిస్తే, వారు 1½ సంవత్సరంపాటు దేశం మొత్తంతిరిగి 40 పేజీల కరపత్రాన్ని అందజేశారు. గత 150 సంవత్సరాలుగా పరాయి ప్రభుత్వములో దేశములో బట్టల యంత్రాలు ఎంతప్రయత్నం చేసినా చేనేత అనేపీడ విరుగడకాలేదు. దానిపీడ విరుగడ చేయడానికి ఒకమందు కనిపెట్టాలని కమిటీ ఆలోచించి ఈ చేనేతమగ్గాలస్థానే power మగ్గాలను నెలకొల్పాలని ఒకచిట్కాసూచన చేశింది. ఈ సూచననుచూచి, సుప్రసిద్ధ రాజకీయవేత్త రాజగోపాలాచారిగారు అఖిలభారత కాంగ్రెస్‌కమిటీ కార్యదర్శి, శ్రీమన్నారాయణ అగర్వాలా ఇంకా దేశంలో అనేకమంది ప్రముఖులు ఈ కనుంగో కమిటీ సిఫార్సులను గురించి విమర్శించి వాటిని అమలు

25th April, 1955] (Sri Pragada Kotaiah)

పరచటానికి వీలులేదని చెప్పారు. చేనేతవారికి రక్షణయిచ్చే నిమిత్తం చీరలు ధోవతులు కేటాయించి నూలు ఉత్పత్తికోసం చిన్నవడుకు సాధనలు ప్రవేశపెట్టాలనేది ఈవేళ దేశం మొత్తం మీద అందరు అంగీకరించినటువంటి విషయం. ఆరుమాసాలుగా ఈ కమిటీరిపోర్టు ప్రభుత్వం చేతుల్లో ఉన్నప్పటికీ దానిపైన ఆంధ్రప్రభుత్వము ఏమిచేసిందనేది ఇంతవరకు తెలియదు.

మన గవర్నరుగారు 4, 5 మాసాలుగా అనేకవిషయాలలో ప్రత్యేకశ్రద్ధ తీసుకున్నారు కాని వ్యవసాయం తరువాత అతి ప్రధానమైనటువంటి చేనేతపరిశ్రమ విషయములో వారు యింత నిరాదరణ ఎందుకు చూపించారో అర్థము కావడములేదు. ఈ చేనేత విషయాలలో గవర్నరుగారు వారి ప్రసంగంలో ఏమీచెప్పలేదు. కాబట్టి ప్రభుత్వం ఈ విషయంలో ఒక నిర్ణయానికివచ్చి వుంటుందని నేను అనుకోవడము లేదు. కాని బంజరుభూములు పంపకము విషయంలో కొంతవరకు ప్రభుత్వము నిర్ణయానికివచ్చినట్లు కన్పిస్తున్నది. పోయిన శాసనసభలో బంజర్లను ఉచితంగా పంచాలని ఏకగ్రీవంగా తీర్మానం చేసింది. దాన్ని అమలుపరచడానికి అప్పటి ప్రభుత్వము నిశ్చయముచేసిన వెనువెంటనే నందికొండ వ్యవహారము వచ్చేటప్పటికి, బంజర్లసంగతి నిలిపివేశారు. ప్రాజెక్టు ప్రాంతాలకు సంబంధించిన బంజర్ల సంగతిగూడా నిలిపి వేయబడ్డది. మా గుంటూరుజిల్లాలోని రొంపేరు ప్రాంతంలోవున్న బంజర్లవిషయంలో అవతల drainage improve కాబడ్డది కాబట్టి, అక్కడవున్న బంజర్ల పంపకము నిలిపిచేయవలసిన అవసరం వుంటుందని నేను భావించలేదు. ప్రభుత్వమువారు ఒకపర్యాయము ప్రత్యేకంగా ఒక జి. ఒ. ను ప్యాసుచేసి, అందుకుగాను సిబ్బందినివేసి యీ బంజర్లను పంచడము ప్రారంభించేశారు. సుమారు ఒక వెయ్యిఎకరాలవరకు పంపకము ఆపివేశారు. ఈవిధంగా నిలిపివేయడానికి కారణము ఏమిఅని విచారించగా, ఈభూములకు మార్కెటురేటు నిర్ణయించి అటుతరువాత యిచ్చుటకు, ఈభూముల పంపకమును నిలిపివేయుటకు వుత్తరువులు పంపారని తెలిసింది. కాని యీరొంపేరు బంజర్ల విషయములో అలాంటి మార్కెటురేటు వసూలుచెయ్యడమనే సమస్య తెచ్చిపెట్టినట్లయితే చాలా చిక్కు సమస్యలకు అవకాశములు ఏర్పడుతవని మనవిచేస్తున్నాను. కాబట్టి వెనుకటి ప్రకారముగా రొంపేరు బంజరుభూములను పేదవాళ్లకు వుచితముగా పంచవలసిందిగా ప్రభుత్వాన్ని అర్థిస్తున్నాను.

*Sri S. Vemayya:—అధ్యక్షా, ఈరోజున మనముందరవున్న గవర్నరు ఉపన్యాసం మీద వచ్చిన అభినందన తీర్మానము పైజరిగే చర్చలో యీతీర్మానము బలపరచి అభినందించటానికి బదులు, నేను వ్యతిరేకించవలసి వున్నదని భావిస్తున్నాను. మొట్టమొదట యీ తీర్మానము తీసుకొనివచ్చిన నాసోదర సభ్యుడు శ్రీరాజేశ్వరరావు చాలా విషయాలు చెప్పారు. ప్రభుత్వవిధానాన్ని అనేకవిధాలుగా వారు పొగడడము చూడగా నాకు భారతములో ఒకవిషయము జ్ఞాపకము వచ్చింది. అంటే, ఒకమనిషిని పొగిడేటప్పుడు ఒకనాలుక చాలదు.

ప్రయ్యవలయు నూరు । ప్రయ్యలుగాగ
అపుడుగాని చాలదు । అతనిబొగడ ॥

అనేవిధంగా వారు ప్రభుత్వాన్ని పొగిడారు. అయితే అనేక విషయాలలో వారు చెప్పినదానికి నేను జవాబు చెప్పడముకాదు గాని, యిప్పుడు మనం ఈ అభివందన తీర్మానం చర్చిస్తున్న సమయములో బంజర్లపంపక సమస్యతీసుకున్నప్పుడు అది వివరముగా చెప్పవలసి వుంటుంది.

(Sri S. Vemayya) [25th April, 1955

మొట్టమొదట penalties సమస్య గందరగోళముగా వున్నది. ఈ విషయము నాకు అనేక ఉత్తరములగుండా వస్తున్నది. జమాబంది కాలములో యీ పెనాల్టీలు తీసివేయమని అర్జీపెట్టు కుంటే, జమాబంది ఆఫీసర్లు యీ పెనాల్టీలో కొంత తోసివేయడం, జరుగుతున్నది. అసలు పెనాల్టీను అంతాతీసివేస్తే, దానికి విలువవుండేది, పైగా యీ జమాబంది జరపడమునకు కొంత మటుకు కాలము పొడిగించినట్లు తెలుస్తున్నది. పెనాల్టీలుమాత్రం యీ పేదరైతులయొక్క చెంబు, తప్పాల బైటవేసి, వారిని బాధించి నిర్బంధముగా వసూలు చేస్తున్నారని వింటున్నాను. నాకు తెలిసి నంతమటుకు Board Standing Orders ప్రకారము యీ penalties తీసి వేయడమును గురించి జమాబంది ఆఫీసర్ల direction లో వుంటుందని నేను అభిప్రాయపడుతున్నాను. ఆ B.S.O. ను ఉపయోగించకుండా యీవిధంగా నిర్బంధముమీద వసూలుచేయటానికి ఆలోచించి నప్పుడు జమాబందిమాత్రము postpone చేయటానికి ప్రభుత్వము ఏమైనా ఆలోచనచేసిందా అని ప్రశ్నిస్తున్నాను.

The Hon. Sri B. Gopala Reddi.—ఉత్తరువులు జారీ చేస్తున్నాను.

Sri S. Vemayya:—ఉత్తరువులు జారీచేస్తున్నామని ముఖ్యమంత్రిగారు చెబుతున్నారు. అందుకు నాకు ఇప్పుడు సంతోషము కలిగింది. బంజర్లు అంటే కొంతమందికి చాలా తేలికగా వుండ వచ్చు. ఈ బంజర్ల విషయము కొద్దిగా చెప్పదలచాను. ఈ బంజర్లలో అనేకరకాల బంజర్లు వుంటూ వున్నవి. అందులో కొన్ని గుంటపోరంబోకు, వంకపోరంబోకు, వాగుపోరంబోకు, గ్రామనత్తం పోరం బోకు, యిల్‌పోరంబోకు వగైరాలువున్నవి. కొన్ని ఆక్షేపణకరంగా వుండేవివున్నవి. అయితే సాధా రణంగా B.S.O లో పోరంబోకులంటే communal land అని అంటారు. Communal land అంటే సాధారణముగా ఆక్షేపణ చేయబడేవిగా తీసుకుంటారు. ఇటువంటివి ఆక్షేపణకరమై నవిగా treat చేస్తే, ఒకవేళ యివి ఆక్రమణలోవుంటే, వాటికి penalties వేయడం జరుగు చున్నది. ఇవన్నీగూడా ఆక్షేపణలేకుండా మినహాయించి, penalties లేకుండా వదలివేయమని అంటున్నాను.

తరువాత forests విషయం మనవిచేస్తాను. ఈ forest lands చాలామటుకు సాగుకు లాయకీగా వున్నప్పటికిని, waste గానే వుంటున్నవి. ఈభూమిని సాగుకు యివ్వవచ్చునా, లేదా అనేది ప్రభుత్వం ఆలోచించి, వీటిని వృథాగా waste గా వుంచకుండా, సాగుకుయిచ్చి, వుపయోగము లోకి తీసుకొనివస్తే పేదవారికి వుపయోగపడగలవు.

ఇవిగాక యింకను లంకభూముల విషయము వున్నది. ఈ భూములవిషయము ప్రభుత్వదృష్టికి పదేపదే తీసుకొని రావడమయింది. ఇంతవరకు ప్రభుత్వమువారు co-operative societies ద్వారా వేలంపాటపెట్టి అమరకానికి విడుస్తున్నారు. వేలంపాటలో ఎక్కువపాట వచ్చినందువల్ల, గ్రామములోని ధనవంతులుగావున్న భూస్వాములుగూడా పాటకు పోటీచేయడమువల్ల, యివి యీపేద వాళ్లకు దక్కకుండా పోతున్నవి. ఒకవేళ మాలిపట్టుదలకు గాని, పొట్ట ఆత్రముచేతగాని, యీవేలం పాట ఎంతవరకైనా పాడి వాళ్ల పేరటికి కొట్టివేయించుకొంటే, వేలంసొమ్ము చెల్లించటానికి అప్పుచేసి పాటకు నిలబడుతున్న కారణముచేత, వీరు ఆర్థికంగా దెబ్బతిని పోతున్నారు. ఈవిధంగా ప్రతిపంవ

త్వరము హెచ్చుపాటలకు దిగడమువల్ల వీరు అప్పులపాలవుతున్నారు. ఈవిషయము ప్రభుత్వానికి గూడాతెలుసు. ప్రభుత్వము యీవిషయములో ఏమినిర్ణయము చేస్తారని అడుగుతున్నాను.

ఇవిగాక tank-bed lands కొన్ని వున్నవి. ఈ భూములు చాలామట్టుకు abandoned tanks లో వున్నవి. ఇవి abandoned tanks గదా అని, ఎవరైన పేదవాళ్లు ఆక్రమించి సాగు జేయటానికి ప్రారంభిస్తే, గ్రామాలలోని రైతులు ఏదోవిధమైన ఆక్షేపణలు చేస్తూవుంటున్నారు. ఈ ఆక్షేపణలు సాధారణముగా గ్రామంలో స్థానికంగా వుంటున్న పార్టీకక్షల మూలముగా తేబడు చున్నవి. బంజరుభూములు సాగుచేసుకుంటే అక్కడ ఆక్షేపణలు, adandoned tanks గదా అని వీటి beds లో వున్న భూములకువస్తే, యిక్కడకూడ ఏదో రకమైన ఆక్షేపణలు లేవదీసి, యీ పేదవాళ్లకు ఎక్కడగూడా జానెడు స్థలము లేకుండా చేస్తున్నారు. ఈ tank-bed lands కు ముఖ్యంగా ఆయకట్టు అనేది వుండదు. అందువల్ల యీ tank-bed lands కు ఆక్షేపణ ఎందుకో అర్థముకాకుండా వున్నది. వీటికి ఆక్షేపణ అవసరములేదంటే దీనికి ఒక కారణము మనవి చేస్తాను. ఈ చెరువులు ఎప్పుడో పూడిపోయి వుంటవి. మరమ్మతులు లేవు. అందుకని అవి abandoned గా వున్నవి. నీరు పొలాలలోనుంచే పోయేదికద్దు. స్థానికంగా గ్రామాలలో వుంటున్న పార్టీకక్షలరీత్యా, యీ భూములకు ఆక్షేపణలు లేవదీస్తున్నారు. ఇటువంటి వాటికి వుదాహరణలు చెప్పాలంటే వేలాదిగావున్నవి. Specify చేసి చెప్పగలను. ఈ భూములకైనా ఆక్షేపణ లేకుండా చేయ మని ప్రభుత్వాన్ని కోరుచున్నాను. ఈ భూములు, యింకా యితర పోరంబోకులు ఆక్షేపణలేకుండా మినహాయిస్తే, పేదవాళ్లు సాగుచేసుకొని జీవించటానికి వీలు కలుగజేయమని ప్రభుత్వానికి మనవిచేస్తు న్నాను. ఎక్కడైనాసరే, ఆక్షేపణలేని పోరంబోకులైనను యివ్వమని అర్థిస్తున్నాను.

ఇక Food Committees పోయి District Planning Committees ను ప్రభుత్వమువారు ఏర్పాటుచేశారు. ఈ కమిటీలలోగూడా ఎన్నో తీర్మానాలు చేస్తున్నాము. అక్కడవున్న వుద్యోగస్థులు యిప్పుడువున్న సిబ్బంది చాలదు, ఇంకాకావలసి వున్నదని చెప్పతున్నారు. దీనికి కారణము F.T.L. (above) F.T.L. (below) అనేవి వుంటున్నవి. ఇందులో above ఏది, below ఏది అనేది నిర్ధారణచేయాల్సి వున్నదట. ఇందులో ఏ యిబ్బందిగూడా లేని భూమినే యివ్వమని అంటున్నాను. F.T.L. అవునా కాదా అనేది నిర్ధారించుటకు యింకను అధికంగా సిబ్బంది కావాలని ప్రభుత్వోద్యోగస్థులైన యింజనీర్లే చెబుతున్నారు. కాబట్టి పైన నేను చెప్పిన విషయాలు దృష్టిలో పెట్టుకొని యింజనీర్ల సలహాప్రకారము యింకా కొంతమంది సిబ్బందినివేసి, F.T.L. level నిర్ధారణచేయిస్తే, సాగుకు లాయకీగా వుండే భూములను, ఆక్షేపణలేకుండా మినహాయించి యిస్తే, పేదవాళ్లు సాగుచేసుకొని బ్రతకటానికి వీలు కలుగజేసినట్లవుతుంది. ఈ భూముల విష యములోగూడా గత ప్రభుత్వమువారు ఏదో కవులుదారీ బిల్లు తేబోతున్నామని అప్పటి అర్థికమంత్రి శ్రీ విశ్వనాథంగారు చెప్పారు. వారు చెప్పే చెప్పడముతోనే పత్రికలవారు ఆసంగతి వెంటనే బాహా టంగా ప్రకటించారు. ప్రకటనలవరకేగాని, బిల్లుమాత్రం యీరూపంతోగూడా రాలేదు. ఈ సంగతి దృష్టిలో పెట్టుకొని, భూస్వాములు ఎక్కడైనా మక్తాలకు చేసుకునే పేదవాళ్లను తొలగింప ప్రారంభిం చారు. ఆ విధంగా పేదవాళ్లను బైటకు వెళ్లగొట్టి పారవేయడమువల్ల వీరికి ఏ విధంగాను రక్షణ లేకుండా పోయింది. పొట్టపోసుకొని జీవించటానికి జానెడు భూమి అయినను కౌలుకు దొరక్కుండా పోయింది.

ఈ విషయము పూర్తిగా ప్రభుత్వంవారికి తెలుసు. దీన్నిగురించి, యీ కౌలుదార్లకు రక్షణఅనేది ఏ విధంగా ప్రభుత్వమువారు యివ్వదలచుకున్నారనిన్నీ, ఏ సాధకాలు ప్రభుత్వమువారు తేదలచుకున్నారనిన్నీ, ప్రభుత్వాన్ని అడుగుతున్నాను.

అంతేకాకుండా మనము మద్రాసురాష్ట్రములో వుండగా గౌరవనీయులైన మంత్రి లచ్చన్నగారితో యీ కౌలుదారి రక్షణబిల్లునుగురించి మేము మాట్లాడిన సమయములో వారుగూడా ముఖ్యంగా యీ గ్రామాలలో జరిగే తొలగింపులనుగురించి యీనాం చట్టముయొక్క నిర్వచనాన్ని సవరించాలని పదేపదే ప్రభుత్వమువారిని అర్థిస్తూవచ్చారు. ఇంతవరకు ఏ నిర్వచనముగాని, ఏ సవరింపులుగాని బైటికిరాలేదు. ప్రభుత్వమువారు యీ విషయములో యింతకాలయాపన ఎందుకు చేస్తున్నారో అర్థము కావడములేదు.

తరువాత దేవస్థానము భూములు, యింకా యితర భూములు కోఆపరేటివ్ సొసైటీలద్వారా యివ్వదలచినట్లు తెలుస్తున్నది. అందులో అవిగూడా వేలంపద్ధతిమీద యివ్వాలనే ప్రభుత్వోద్దేశము వున్నట్లు తెలుస్తున్నది. వేలంపద్ధతి పెట్టితే ధనికవంతులైన భూస్వాముల చేతులలోకి ఇవి పోవడము తప్ప, పేదవాళ్లకు ఏవిధంగా సహాయముచేయ వీలవుతుందని అడుగుతున్నాను. కాబట్టి వేలంపద్ధతి బొత్తుగా తలపెట్టవద్దని నామనవి. కౌలుదార్లను తొలగించకుండా ఒక రక్షణచట్టము త్వరలో అమలుకు తేవలసిందని మనవి చేస్తున్నాను.

ఇకపోతే యీ గవర్నరు వుపన్యాసంలో హరిజనుల గురించి చెప్పిన విషయాల్లో ముఖ్యమైనది అంటరాని తనం. ఈ రోజున ఏ నాయకులైనా గుండెమీద చేయివేసికొని అంటరాని తనం పోయిందని చెప్పగలరా? ఇంతవరకు కాయితాలలో వుండిపోయింది కాని యిది నిజంగా కార్యరూపేణా అమలు జరగలేదు. ప్రతి గ్రామంలో హరిజనులకు యిండ్లస్థలాలు యిచ్చేవిషయంలో Land Acquisition చట్టలోపాలవల్ల ఆలస్యం జరుగుతున్నది. హరిజనుల నుద్ధరించేందుకు కేటాయించిన డబ్బులో సగం సిబ్బందికే దుబారా అయిపోతున్నది. ఇప్పటికే గత 14 సంవత్సరాలనుంచి కూడా pending cases అనేకం వున్నాయి. అవి ప్రభుత్వదృష్టికి తీసుకువచ్చి పదేపదే చెప్పినాము. Procedure చాలా దీర్ఘంగావున్నది అని ప్రభుత్వపరిపాలనలో వున్నటువంటి విషయాలు చెప్పినప్పటికీ యీ procedure తగ్గించినట్టు యేమీ కనపడదు. కాబట్టి దానినిగురించి ఆలోచించవలసి వుంటుందని చెబుతున్నాను. తరువాత ఆఫీసర్లకు పే కమీషను సిఫార్సులను అమలుపరచే విషయం ఈ ప్రసంగంలో లేనందుకు విచారాన్ని తెలియజేస్తున్నాను. శలవు accumulation మూడునెలలు మాత్రమే యిచ్చారు. 3 నెలలుమాత్రమే కాకుండా గడించిన శలవంతా నిలవవుండాలని నా అభిప్రాయం. తరువాత personal files, confidential reports maintain చేయడం జరుగుతున్నది. ఉద్యోగులకు confidential files తీసివేయడానికి యోచించాలి. తరువాత medical aid G.O., నిరుపయోగంగా వుంది. ఎందుచేతనంటే గవర్నమెంటువారు డాక్టరు సర్టిఫికేటు కావాలంటున్నారు. అట్లాకాకుండా ప్రయివేటు డాక్టరు సర్టిఫికేటుకూడా ఆమోదించేటట్లు G.O., ను సవరించాలి. House Rent Allowance తీసివేసినందుకు విచారిస్తున్నాను. ఒకేస్థలంలో వున్న కేంద్ర ప్రభుత్వోద్యోగస్థులకు రాష్ట్రప్రభుత్వోద్యోగస్థులకు తేడాచూపడం ప్రజాస్వామికం కాదని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

**Sri P. Ranga Reddi:**—అధ్యక్షా, ఎన్నికల అనంతరం జరిగినటువంటి యీ ప్రథమ సమావేశంలో స్వేచ్ఛగా జరిగిన ఎన్నికలు గురించి చెప్పడం సరైనదని నేను భావిస్తున్నాను. ప్రధానంగా కమ్యూనిస్టుపార్టీ తరఫున, తరువాత ప్రజాసోషలిస్టుపార్టీ తరఫున మాట్లాడిన వ్యక్తులు యీ ఎన్నికలు న్యాయంగా జరగలేదని భావించడం చాలా అన్యాయమని మనవిచేయాల్సి వుంటుంది. కాంగ్రెసు పార్టీ తరఫునుంచి వారు చెప్పినట్లుగా ముఖాముఖీపోటీలో వారు చేసినటువంటి అన్యాయాలకు వేలాది వుదాహరణలు యివ్వవచ్చు కాని యింతకుముందు మాట్లాడిన పెద్దలు, కమ్యూనిస్టుపార్టీనుంచి గాని, ప్రజాసోషలిస్టు పార్టీనుంచిగాని కాకుండా స్వతంత్రగావే నిలబడి ఎన్నికైన శ్రీరామకృష్ణరాజుగారు చెప్పినారు. వారు కాంగ్రెసుతో పోటీచేసి గెలచినవారు. దేశంలో ఏవిధంగా ఎన్నికల కార్యక్రమం జరిగిందీ వారు స్పష్టంచేశారు. వారు చెప్పినటువంటి మాటలను కమ్యూనిస్టుపార్టీ, ప్రజాసోషలిస్టుపార్టీ నాయకులు న్యాయంగా అర్థంచేసుకుంటారని నేను అనుకుంటాను. కమ్యూనిస్టుపార్టీగాని కాంగ్రెసు పార్టీగాని ఎన్నికలలో పాల్గొన్నప్పుడు తమ ప్రణాళికలు తీసుకొనిపోయి ప్రజలముందు పెట్టారు. ప్రజలు ఆయా కార్యక్రమాలను అర్థంచేసుకుని గెలిపించారు. అందుచేత కాంగ్రెసును అన్యాయంగా నిందించవద్దని కమ్యూనిస్టు నాయకులకు విజ్ఞప్తి చేస్తున్నాను. కమ్యూనిస్టులు ఎన్నికల సమీక్షచేసుకున్నారు. అంతసమీక్ష అయిన అనంతరంకూడా యిది కేవలం కాంగ్రెసుపార్టీవారి దౌర్జన్యం, అన్యాయంవల్ల వారికి విజయం కలిగిందని చెబితే ధానిని ఖండించడమేకాక అది వారి తత్వంఅని మనవిచేస్తున్నాను. మేము మాయొక్క కార్యక్రమాలపైన ఆధారపడి యీ ఎన్నికలలో పాల్గొని విజయాన్ని సంపాదించుకున్నాం. ఒక్క కార్యక్రమమేకాకుండా క్రొత్తగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత ఏర్పడిన ఆంధ్రప్రభుత్వం 13 మాసాలుగా జాతి అభివృద్ధిని చేసినటువంటి ప్రధానకార్యాలు కూడా యీఎన్నికలలో విజయం సంపాదించడానికి చాలవరకు సహాయంచేసినవని చెప్పినచో అతిశయోక్తిలేదు. ప్రధానంగా నీటిపారుదల విషయంలో, చేనేత పారిశ్రామికుల విషయంలో, విశ్వవిద్యాలయ స్థాపనవిషయంలో, కరువుప్రాంతాలను, వెనుకబడ్డ ప్రాంతాలను, అభివృద్ధిచేసే విషయంలో, విద్యుచ్ఛక్తి సరఫరా విషయంలో కృషిచేసి ప్రజలలో విశ్వాసాన్ని చైతన్యాన్ని కలిపించి కాంగ్రెసు కార్యక్రమానికి నిజంగా వారు దోహదంచేశారని నేను భావిస్తున్నాను. ఆవిధంగా ఎన్నికలయొక్క సమీక్షచేసుకొని యీరోజు గవర్నరు ప్రసంగంలో చేసినట్టి పాలసీస్టేటుమెంటు చూసినట్లయితే దానికీ దీనికీ అవినాభావసంబంధం వున్నదని చెప్పవలసి యున్నది. ఆరోజు ప్రభుత్వం ఏవిధంగా ప్రజాసమస్యలను పరిష్కరించడానికి పనిచేసిందో, యీరోజుకూడా ప్రభుత్వం అటువంటి కార్యక్రమానికి పూనుకుంటుందని ఆ పాలసీస్టేటుమెంటు తెలియజేస్తున్నదని మాత్రం భావిస్తున్నాను. ఈరోజు నీటిపారుదల సమస్యను పరిష్కరించడానికి ప్రభుత్వం కంకణం కట్టుకున్నారు. నందికొండ ప్రాజెక్టును మొదటి పంచవర్ష ప్రణాళికలో చేర్పించే కార్యక్రమము సాగిస్తూనే వున్నది. ఆదేవిధంగా తుంగభద్ర హైలెవల్ కాలువను సాధించడానికి నిరంతరం కృషిచేస్తారని నేను భావిస్తున్నాను. పెద్దపెద్ద ప్రాజెక్టుల విషయంలో చేసినకృషికి సంతోషిస్తున్నాము గాని చిన్నచిన్న మైనరు యిరిగేషను స్కీములుగూడా అమలుపరచాలని కోరుతున్నాను. 120 నుంచి 140 స్కీములవరకు కేంద్రప్రభుత్వానికి పంపి సహాయం పొందుటకు ప్రయత్నించి వచ్చేబడ్జెటులో చేరుస్తారని ఆశిస్తున్నాను. అట్లాగే చెరువులు మరమ్మతు విషయంలో ఒక వుదాహరణ చెబుతాను. సంజీవరాయ చెరువు మరమ్మతుకు టెండర్లు పిలవడం జరిగింది. కంట్రాక్టరును నిర్ణయంచేయడంకూడా జరిగింది. కాని కార్యక్రమం నిలిపివేయబడింది. దానిని పూర్తిచేయడానికి ముందంజవేస్తారని ఆశిస్తున్నాను.

(Sri P. Ranga Reddi) [25th April, 1955

బంజరుభూముల సమస్య యీ రోజు నిజంగా ప్రధానమైన సమస్యగా ఆంధ్రదేశములో కనిపిస్తున్నది. దాదాపు 13 లక్షల ఎకరాల బంజరు పంపకానికి చేయవలసిన కార్యక్రమాన్ని ప్రభుత్వం ఉపక్రమించినది. అయితే ప్రాజెక్టుల క్రిందవున్న భూములను పంపకము చేయడానికి వీలులేదనే నిర్బంధము వున్నపుడు బంజర్లు ఎక్కడవున్నవని ప్రశ్నవస్తున్నది. కాకపోతే వ్యవసాయానికి యోగ్యము కాని భూమిని సాగుకు అనువుగా చేయడానికి ఎక్కువడబ్బు ఖర్చుచేసి బీదలకు పంచిపెట్టినందువల్ల లాభముండదు. బంజర్లనుదున్ని వ్యవసాయము చేయాలని ఉత్సాహముగల వారికి co-operative farming societies ను ఏర్పాటుచేసి వాటిని ప్రభుత్వ ఆధ్వర్యాన నిర్వహించినట్లయితే మంచిదని మనవిచేస్తున్నాను.

రోజురోజుకు నిరుద్యోగ సమస్య విషమసమస్యగా పరిణమించుచున్నది. పరిశ్రమలను అధికము చేయడానికి, వారికి loans యివ్వడానికి ప్రభుత్వమువారు Finance Corporation ను ఏర్పాటుచేయాలని అనుకుంటున్నారు. ఎక్కువ పరిశ్రమలు స్థాపించుటకు ప్రభుత్వము సరియైన కార్యక్రమమును నిర్ణయించాలని నేను కోరుచున్నాను. అన్నింటికంటె ఇప్పుడు గవర్నరుగారి ప్రసంగములోని విధానాలు మనము దృష్టిలో పెట్టుకొనవలసివుంటుంది. ఆవడి కాంగ్రెస్ తీర్మానమునకు, "Socialistic Pattern o Society" కి, అనుగుణముగా ప్రభుత్వ కార్యక్రమము కొనసాగించవలసి వుంటుంది. గవర్నర్‌గారి ప్రసంగానికి నా అభివందనాలు తెలియజేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri P. Narasimhapparao:—అధ్యక్షా, నేను గవర్నర్‌గారి ప్రసంగమును గురించి కొద్దిగా చెప్పదలచుకున్నాను. అందులకు నాకు అవకాశమిచ్చినందులకు మీకు నమస్కారములు చేస్తున్నాను. ద్వితీయ పంచవర్ష ప్రణాళికనుగురించి గవర్నరుగారి ప్రసంగంలో స్పష్టంగా తెలియజేయలేదు. ఈ ప్రణాళికను ఏ policy ని ఆధారంగా చేసుకొని అమలుచేయదలచుకొన్నారో బోధపడుటలేదు. ఈ ప్రణాళిక ఏ ఏ తాలూకాలకు, ఏ ఏ ప్రాంతాలకు ఉపకరిస్తుందో స్పష్టపరచలేదు. మీరు అవలంబించే విధానం reasonable గా ఉండాలని కోరుతున్నాను. మీరు ఏ ఏ గ్రామాలలో అభివృద్ధిపథకాలు అమలుచేయదలచినది మాకు తెలియదు. ఈ వివరముల నన్నింటిని మాకు తెలియజేయవలెనని కోరుతున్నాను. ముఖ్యంగా మా శ్రీకాకుళం జిల్లా పాలకొండ తాలూకాలో electric lines వేయబడినప్పటికికూడా ఆ తాలూకాలోని ఒక్క గ్రామానికైనా విద్యుచ్ఛక్తి సరఫరా చేయలేదు. కనుక మా తాలూకాలో విద్యుచ్ఛక్తి సప్లయి చేయించాలని ప్రభుత్వమును కోరుతున్నాను.

గొట్టవద్ద వంశధారనదికి అనకట్టు నిర్మించాలని నిర్ణయించినందులకు ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాము. శ్రీ గౌతులచ్చన్నగారు శ్రీకాకుళం జిల్లా విషయమై ప్రత్యేకమైన శ్రద్ధవహించాలి. Irrigation projects అంటూ, పెద్దవి, చిన్నవి, మధ్యతరగతివి అన్నారు. వాటిని అమలు చేయదలచినది, ఏ ఏ ప్రాంతాలకు అవి ఉపయోగపడునది కూడా మాకు తెలియదు. ఆ వివరములను కూడా తెలియజేయవలెనని గ్రామాలకు విద్యుచ్ఛక్తి ఏ ప్రాతిపదికపై సప్లయిచేస్తున్నారో తెలుప కోరుచున్నాను. ఇక P.W.D. వారు సరియైన కాలములో మరమ్మతులు చేయకపోవడముచేత 10 రూపాయలతో మరమ్మతు అయ్యేవనికి 3 వేలరూపాయలు ఖర్చు కావలసివస్తోంది. Irrigation works విషయములో P.W.D. శాఖవారు వారి కార్లు ఎంతవరకు వెళ్లతాయో అంతవరకు మాత్రమే works జరుగుతాయి. తరువాత పనులు జరగడంలేదు. కొండల్లు తక్కువవని కొన్నిపనులు ఆపేవేయ

బడుతున్నవి. వర్షాకాలములో వరదలు వచ్చినప్పుడు ప్రజలు చాల నష్టపడుచున్నారు. కొన్ని గ్రామాలలో యిండ్లు కొట్టుకుపోతున్నాయి. వరదదెబ్బ తిన్నప్రాంతంలో యిసుకమేట వేయడంవల్లకూడా యిండ్లకు పంటభాగములకు నష్టంకలుగుతోంది. ఇంటువంటి బాధలకు ప్రజలు లోనుకాకుండా ప్రభుత్వము తగిన చర్యలు తీసుకుంటారని ఆశిస్తున్నాను.

ఇంకను కొన్నివిషయాలు చెప్పవలసివుంది. మరొక అయిదునిముషాలు ఇవ్వాలని కోరుతున్నాను. చాలా రోజులనుంచి గవర్నమెంటువారు వంశధార రిజర్వాయరుగురించి ప్రయత్నాలు చేస్తున్నారు. ఇప్పటికైనా దానిని తెచ్చినందుకు గవర్నరుగారిని అభినందిస్తున్నాను. ముఖ్యమైన తాలూకాల్లో టెలిఫోను సౌకర్యాలు లేవు. ప్రతి తాలూకాకు టెలిఫోను సౌకర్యంవుండేట్లా సిఫార్సు చేయాలని కోరుతున్నాను. పాలకొండకు ఒక Telephone office open చేయాలని కోరుతున్నాను. అగ్రహారాలు విషయం మనవిచేస్తున్నాను. ఈ అగ్రహారాల బిల్లుపెట్టిన తరువాత కూడా రైతులస్థితి ఏమీ బాగు పడలేదు. ప్రతివారు ప్లీడర్లకోసము డబ్బు ఖర్చుచేస్తున్నారు కాని రైతులు ఏమీ బాగుపడలేదని మనవిచేస్తున్నాను. సెటిల్మెంటు ఆఫీసరుదగ్గరో, ట్రిబ్యునలులోనో, హైకోర్టులోనో ఖర్చులు చేసుకోడం జరుగుతోంది ప్రభుత్వం వీరివిషయం ఆలోచించి సివిలు కోర్టునుంచి తప్పించి సెటిల్మెంటుచేస్తారని కోరుతున్నాను.

*Sri Namburi Srinivasa Rao:—అధ్యక్షా, గౌరవసభ్యులారా, నూతనంగా యిక్కడ గవర్నరుగారుచేసిన ప్రసంగాన్నిగురించి రాజకీయ పక్షాలవారు వివిధముగా వారివారి అభిప్రాయాలు ప్రకటించిన మీదట నాకుగల అభిప్రాయాలను ప్రకటించే సావకాశం కల్పించినందుకు అధ్యక్షులవారికీ ధన్యవాదాలు అర్పిస్తున్నాను. గవర్నరుగారి ప్రసంగం ఏ ప్రణాళికను గురించిగాని, ఆశయాలను గురించిగాని, సిద్ధాంతాలను గురించిగాని, తెలుపుటలేదని విమర్శించడమే వృత్తిగా పెట్టుకొని సుందరయ్యగారు వాదించిన విధానం ఈవేళ క్రొత్తదికాదు. సిద్ధాంతరీత్యా, ఆచరణరీత్యా ఆరాధ్య దేశమైన రష్యాను స్తుతించుకోవడం—పరనింద, ఆత్మస్తుతి అన్నట్లుగా—వారికి అలవాటని మనకు తెలు సును. ఇదే ధోరణిని వారు ఇప్పుడుకూడ అవలంబించినందుకు విచారిస్తున్నాను. అజీర్ణరోగి మాదిరిగా, సిద్ధాంతాల గందరగోళంతో సర్వప్రపంచంలోను పిపీలికాది బ్రహ్మపర్యంతం తామే representatives అని వారు ఇక్కడ వాక్రుచ్చిన వాక్కులు, కాంగ్రెసుకు గోరీకట్టి ఎర్రకోటలో పాగావేస్తామని చెప్పిన ప్రగల్భాలు, చివరకు తబ్బిబ్బై శృంగభంగమైన తరువాత వారు అవలంబించిన విధానం ఎంతవరకు సబబులన్నది నంబూరి శ్రీనివాసరావు చెప్పలేడు కాని శ్రీరంగం శ్రీనివాసరావు చెప్పగలడు. ఆయన అభ్యుదయకవి. గవర్నరు త్రివేదీగారిని త్రివర్ణపుగవేదీగా, ఆయన గౌరవనీయులైన ఉత్తమ పౌరుడనే విషయంమరచి, అభ్యుదయ పత్రికారాజమనబడే విశాలాంధ్రలో వర్ణించారు. వారినిగురించి ఆంధ్ర ప్రజలకు తెలిసినవిషయమే కాబట్టి ఒకటి రెండు విషయాలు మాత్రం చెబుతాను. వ్యవసాయ కూలీలంటే తెలియని సుందర రామిరెడ్డిగారు, గోపాలరెడ్డిగారి రాజ్యంలో సంజీవ రెడ్డిగారి ఉపరాజ్యంలో వ్యవసాయకూలీల బాధలగురించి వర్ణించారు. సుందరయ్యగారు ఖద్దరువాదులుగావుండి ఇప్పుడు సిల్కులు కట్టుకొంటున్నారు. వాక్రుచ్చిన వాక్కులు proletariat dictatorship శ్రామిక నియంతృత్వంపై వారు వెలువర్చిన అభిప్రాయాలు కలియుగ వేమన్న చెప్పలేకపోయినా మన వేమయ్య చెప్పినాడు. ఇరవై సంవత్సరాల్లో అస్పృశ్యత ఎంతవరకు పోయిందో

తమ entertainment ఉపన్యాసం ద్వారా వేమయ్యగారే తెలియచేశారు. ఈవేళ కమ్యూనిస్టుల్లో కూడా హరిజనులకు భోజనం బైటపెట్టేవాళ్ళున్నారు. వారి అభిప్రాయాలతో ఏకీభవించని వారిని వెలివేసినవాళ్ళుకూడ వున్నారు. ఈ విధంగా యుగయుగాలనుండి వచ్చిన అస్పృశ్యత ఆంధ్ర రాష్ట్రం వచ్చిన 15 మాసాల్లో 15 వేలరెట్లుగా అమలు జరుగలేదని అంటే ఏమనాలి? బంజరు భూములను పేదలకుపంచే విషయములో వ్యవసాయం చేస్తున్నవారినే advisory committee గా వేసి వ్యవసాయంచేస్తున్న కూలీలకు పంచే ఏర్పాట్లుచేయించాలని కోరుతున్నాను. Market-value మీద అమ్మితే పేదలకు నష్టంకలుగుతుంది. 'రోజులుమారాయి' సినిమాలో మాదిరిగా మన ఉద్యోగులు మారలేదు.

రెండవది ఏలూరులో tannery work చాలా బాగుగా జరుగుచున్నది. ఈనాడు భారత దేశంలో ఉన్నటువంటి ఉద్యోగస్థులందరు కూడ కావలసిన boots, belts మొదలగు tannery కి సంబంధించిన వస్తువులన్ని అక్కడ తయారుచేయడానికి అవకాశమున్నది. హరిజనులకు కూడ వృత్తి కల్పించి సహాయం చేయదలచినపుడు, కొన్నిలక్షల ఖర్చుతో ఒకచక్కని factory నిర్మించితే చాలా ఉపయోగకరంగా ఉంటుందని మనవిచేస్తున్నాను. అనేక factories నిర్మించ దలచినపుడు నూటికి 50, 60 మందిగా ఉండేటటువంటి కార్మికులకు పని కల్పించుటకు ఒక factory నిర్మించినట్లయితే ఎంతో బాగుంటుంది. ఈ చర్మాలు విదేశాలకు పోకుండా, ఆమీద జరిగేటటువంటి విదేశీయుల exploitation పోవడానికి సావకాశం కలుగజేస్తుందని మనవిచేస్తున్నాను.

ముఖ్యంగా నానియోజకవర్గంలో (చింతలపూడి తాలూకాలో) చండప్రచండుడు చంద్రరాజుగారి శిష్యుడు వేతల పోతరాజుగారితో పోటీబడివచ్చి నటువంటివాడను నేను. అది వెనుకబడినటువంటి ప్రాంతము. అక్కడపోలేరు, జల్లేరు అనుమల్లంక అను చిన్నచిన్న ప్రాజెక్టులు ఉన్నవి. అవి గవర్నమెంటు వారు చెప్పేనటువంటి చిన్నచిన్న ప్రణాళికలలో ఉండవచ్చునని భావిస్తున్నాను. కనుక వాటిని తీసుకోవలసిందని ప్రార్థిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

*Sri P. Satyanarayana:—అధ్యక్షా, భారతదేశముయొక్క ఆర్థికవ్యవస్థ ఇప్పుడు ఒక విషమదశకు వచ్చినది. ఇది అనేకరూపములు దాల్చుతూ ఉన్నది. చేనేతకు మిల్లులకు ఉన్నటువంటి పోటీగురించి సుమారు ఒకపాతిక సంవత్సరాలనుంచి ఆందోళన జరుగుచున్నది. ప్రభుత్వము అప్పుడప్పుడు ఏదో కొంత సహాయం చేస్తున్నప్పటికీ, దానియొక్క తీవ్రతమాత్రం నేటికీ తగ్గలేదు. కేంద్రంలో ఉన్నటువంటి ప్రభుత్వము గానుగలకు expellers కు మధ్యన ఉన్నటువంటి పోటీని తొలగించడమనేది భారతప్రభుత్వ విధానంలో ఒక గణనీయమైన అంశముగా భావించుచున్నాము. Biscuits చేతితో చేయవలెనా లేక ఫ్యాక్టరీల్లో తయారుచేయవలెనా, అదేవిధంగా బీడీలు చేతితో తయారుచేయవలెనా లేక మిల్లుల్లో తయారు చేయవలెనా, మొదలైన విషయాలన్నీ కూడ ఆలోచిస్తూ ఢిల్లీలో ఉండేటటువంటి ప్రభుత్వము ఒక పెద్ద ఆర్థికసూత్రాన్ని పురస్కరించుకొని చాలా ఆందోళనతోటి పనిచేస్తూయుండడం, యిదంతాచూస్తే మొత్తంమీద మన ఆర్థికవిధానం ఒక క్లిష్టమైనటువంటి పరిస్థితికి వచ్చిందని ఒప్పుకోకతప్పదు. స్వరాజ్యం రావడంతోనే అహమ్మదాబాదులో ఉన్నటువంటి మిల్లుయజమానులు మాంచెస్టరులోవున్న మిల్లుయజమానులవలె మనముకూడ కొద్దికాలంలోనే అంతర్జాతీయ ఖ్యాతిగని ఆశించి ఏవో కలలుగని, తమకున్న యావత్తు పలుకుబడిని ఢిల్లీ మంత్రులమీద ఉపయోగించి

చాలాకాలంనుంచి ప్రయత్నం చేస్తున్నారు. ఈనాడు కనుంగో అనేటటువంటి ఒకపెద్దను Chairman గావేసి అఖిలభారత వస్త్రవిచారణ కమిటీని వేశారు. ఆయన సిఫార్సులు మనముందు ఉన్నాయి. అవి చాలా ప్రమాదకరమైనటువంటివి. ముఖ్యంగా రాష్ట్రముయొక్క ఆర్థికవ్యవస్థను చిందరవందర చేస్తుంది. అందుచేత రాష్ట్రప్రభుత్వాలకు ఈవిషయములో అత్యధికమైన శ్రద్ధఉండి తీరవలెను. అందులో ప్రధానాంశం, భారతదేశంయొక్క ఆర్థికవ్యవస్థ handlooms ను liquidate చేయగలి నటువంటి దశకువచ్చిందని నిర్ణయించారు. 10, 12 సంవత్సరములలో భారతదేశములో చేనేత పరిశ్రమ ఉండడానికి వల్లకాదు అనే నిర్ణయానికి వచ్చారు. ఇది చాలా ప్రమాదకరమైనటువంటి సూచన. దీనిని అమలుపరచుటకు ప్రతిరాష్ట్రములోను ఉన్న మంత్రులలో ఒకమంత్రికి ప్రత్యేకమైన బాధ్యతను ఇచ్చి instalmental పద్ధతిలో ఒక్కొక్క సంవత్సరం యిన్నేసి లక్షల మగ్గాలు రద్దుచేసు కొంటూ రావలెననే ఒక కార్యక్రమం యిచ్చారు. ఇది 19 వ శతాబ్దంలో యూరప్‌దేశంలో సామ్రాజ్య విస్తరణ జరుగుతున్న ప్రపంచ చారిత్రకదశలో వెనకపడ్డ దేశాలలోని పరిశ్రమలను రద్దుపరచి తమ పారిశ్రామిక దేశాలలో యంత్రపరిశ్రమను అభివృద్ధి చేసుకొనేటటువంటి దశలో ఈలాటి plans వారికి సాధ్యమైతే కావచ్చుగాని నేటి ప్రపంచ ఆర్థికవ్యవస్థలో భారతదేశానికి ఉన్నటువంటి స్థానాన్నిబట్టి ప్రపంచ రాజకీయ వ్యవస్థలో భారతదేశానికి ఉన్న స్థానాన్నిబట్టిచూస్తే క్రిందటి శతాబ్దంలో Lancashire కు ఉన్నటువంటి స్థానానికి ఈనాడు అహ్మదాబాదు రావడానికి పావకాశంలేదు. ఇప్పుడు మనము ఇతర మార్కెట్లపైన ఆధారపడకుండానే పరిశ్రమను అభివృద్ధిచేసుకోవలసి యున్నది. Imperialist line మననుదుట వ్రాయబడలేదు. మనదేశంలో కొనుగోలు శక్తి పెంచుకోవాలి. మొత్తంమీద ఈసమస్య అంతర్గతంగానే పరిష్కారం కావలసియున్నది గాని గతశతాబ్దములో యితరదేశాల పరిస్థితులనుబట్టి తమ సమస్యలను పరిష్కరించుకొన్నట్లు మనదేశంలో ఈశతాబ్దములో కాదు. కాబట్టి మనదేశంలో కొనుగోలుశక్తి పెంచడంద్వారా ఎక్కువబట్ట ఉత్పత్తి చేసుకోవాలి. ఎక్కువబట్ట ఖర్చు అయిపోయి, యికచాలక అంతమందికి తగినంతబట్ట ఉత్పత్తికాకపోతే అప్పుడు వేరేమార్గం ఆలోచించుకో వచ్చును గాని ప్రస్తుతంమాత్రం చేనేతపరిశ్రమను రద్దుపరచేటటువంటి పరిస్థితి భారతదేశంయొక్క ఆర్థికవ్యవస్థలో యింతవరకు రాలేదని ఖచ్చితంగా మన రాష్ట్రప్రభుత్వం ప్రకటించవలసి యున్నది. ఈవిధంగా అన్నిరాష్ట్రాలలోని ప్రభుత్వాలు ఒత్తిడిచేస్తేనేగాని, కేంద్ర ప్రభుత్వంయొక్క విధానం మారడం కష్టం. గత మూడు సంవత్సరములనుంచి, కేంద్రప్రభుత్వం రాష్ట్రాలకు చేనేత చీరలు, ధోవతులు కేటాయించడం విషయం గురించి ఆందోళన చేస్తూయుండగా, యిప్పుడు యీరిపోర్టు అంతకంటె దారుణ పరిస్థితిని తెచ్చింది. ఈవిషయం గురించి మన మంత్రివర్యులు దీర్ఘంగా ఆలోచించి ఆ Textile Enquiry Committee యొక్క సిఫార్సులను ప్రతిఘటించేటటువంటి వైఖరిని తీసుకోవలసియుండునని నేను మనవిచేస్తున్నాను. మరొకవిజ్ఞప్తి. కేంద్రప్రభుత్వము ఏదో ఎప్పుడో చేస్తుందని, అంతవరకు మనమేమిచేయనక్కరలేదని, చేతులుముడుచుకొని కూర్చోవద్దని మనవిచేస్తున్నాను. ముఖ్యంగా వారిసిఫార్సులు దక్షిణ భారతదేశంలోని రాష్ట్రాలలో చాలా ప్రమాదానికి దారితీస్తాయి. పంజాబులో ఉన్న పరిస్థితికి, మద్రాసు, ఆంధ్ర హైదరాబాదులలో వున్న పరిస్థితికి సంబంధంలేదు. అక్కడ 50 వేల మగ్గాలుంటే, యిక్కడ 30 లక్షల మగ్గాలున్నవి. మగ్గానికి అయిదేసిమంది ఉంటారు. చీరలు, ధోవతుల విషయంలో పంజాబు, కాశ్మీరులలో లాభములేక పోవచ్చును గాని మనకుమాత్రము అది చాలా ప్రధానమైనటువంటిది. కనుక ఎప్పుడో ఎవరో చేస్తారని, అంతవరకు ఏమిచేయకుండా ఉండే విధానము అవలంబించక వెంటనే ఈవిషయం గురించి దీర్ఘంగా ఆలోచించి తగుమైన చర్యతీసు

కోవలసి యున్నది. Sales-tax అనే ఆయుధం మనచేతులలో ఉండనేఉన్నది. దాన్ని వినియోగించి చేనేతను రక్షించవచ్చును. ఇతర మిల్లువస్త్రములపైన additional sales-tax వేసి దానిద్వారా చేనేతపరిశ్రమకు రక్షణకల్పించడానికి సావకాశమున్నది. ఈసందర్భమున యింకొకవిషయము మీదృష్టికి తీసుకురాదలచాను. ఇదివరకు జాతీయోద్యమములో మనము పనిచేసినపుడు మనమెన్నో కష్టాలుపడి కారాగారాలకు వెళ్లి ప్రజలయొక్క sentiments అన్నింటినీ బాగా ప్రకోపింపచేసి, స్వరాజ్యం సంపాదించుకోవలననే ఆకాంక్షతో ఎంతో పనిచేశాము. స్వరాజ్యంవస్తేనేగాని చేనేత పరిశ్రమ అభివృద్ధికాదనే ప్రచారంతో చేనేతవారిని అనేకమందిని జాతీయోద్యమమునకు లాగినాము. చేనేతపరిశ్రమకు సంబంధించినటువంటి అనేక విషయాల గురించి ఈకాంగ్రెసు పెద్దలు, మాబోటివాళ్లు అందరు ఎక్కువ ప్రచారము చేశాము. రెండువందల సంవత్సరములు పరిపాలించిన పరాయిప్రభుత్వము ధ్వంసంచేయబూనినా చేనేతపరిశ్రమను నాశనం చేయలేక పోయింది. ఈవేళ కాంగ్రెసు ప్రభుత్వమూ ఆపని పూర్తిచేస్తామని కనుంగోకమిటీ రిపోర్టుద్వారా ప్రకటనచేశారు. ఇంతకంటె హాస్యాస్పదము మరొకటి ఉండదని చెప్పచున్నాను. కాబట్టి ఈవిషయాన్ని మన మంత్రివర్గము తగుశ్రద్ధతో ఆలోచించి, ఆ కమిటీ సిపార్సులను ప్రతిఘటించడానికి తగుచర్యలు తీసుకోవలెనని కోరుతున్నాను.

Sri P. Rajagopala Naidu:—అధ్యక్షా, నేను గవర్నరుగారుచేసిన ఉపన్యాసాన్ని అభినందిస్తున్నాను. ప్రస్తుతము యీ వుపన్యాసానికి అదనంగా ఒక విషయాన్ని చేరిస్తే బాగుంటుందని భావిస్తున్నాను. ఇది వ్యవసాయ సమస్యలో ధరల స్థిరీకరణకు సంబంధించిన విషయము. దీని ప్రాధాన్యతను కేంద్రప్రభుత్వం ఎంతవరకు గుర్తించిందో అలాగే మన ప్రభుత్వంకూడా కొంతవరకు గుర్తించివున్నది. ఇదివరకు శ్రీ తిమ్మారెడ్డిగారు మంత్రిపదవిలోవున్నప్పుడు యీ ధరల స్థిరీకరణ విషయమై చాలావరకూ పట్టుపట్టారు. అలాగే యీనాడుకూడా యిప్పటి గౌరవ మంత్రిగారైన శ్రీ N. V. Rama Rao గారుకూడా యీ ధరలను స్థిరీకరణ, పెంపుదలను కూడా చేయాలని చెప్పియున్నారు. అదృష్ట్యా యీ స్థిరీకరణ అనేది చాల అవసరమని అనిపిస్తున్నది. వీటినిగూర్చి చెప్పేముందు ప్రతిపక్షనాయకుల విమర్శలనుగురించి మాట్లాడదలచుకున్నాను. మనమందరముకూడా ధాన్యముల ధరలుగాని, యింకా యితరవస్తువుల ధరలుగాని చాలాతక్కువగా వున్నవని ఆందోళనచేస్తున్నప్పుడు మన Communist Party వారు ధరల పెంపుదల భూస్వాములకు లాభకరమని చెప్పింది మరచిపోయినట్లుగావున్నది. ధాన్యంధర బస్తా 1కి పదకొండు రూపాయలున్నప్పుడు దానిని 12,13 రూపాయలకు పెంచాలని మేముకోరుతూవుంటే, అలాచేస్తే భూస్వాములకే లాభదాయకమని చెబుతూ, ఆందోళనచేసే మమ్ములను విమర్శిస్తూ కమ్యూనిస్టు పార్టీవారు ఒక కరపత్రముకూడా అచ్చువేసి ప్రజలకు పంచిపెట్టారు, ఇదివారు గమనించియుండాలి. అలాంటివారు యీనాటి ధరలు స్థిరీకరణకోసం ధాన్యములధరకే కాదు, యితర వ్యవసాయ వస్తువులయొక్క ధరలుకూడా హెచ్చుకావాలని వీరు చెబుతున్నారంటే, యీ శాసన సభను వారి ప్రచారంకోసము ఒక వేదికగా ఉపయోగించాలనే ఆశ వారిలో కనబడుచున్నది. ఈ ప్రచారమునుగురించి రైతాంగములంతా చాలా జాగ్రతగా అప్రమత్తులై వుంటారని నేను అనుకుంటాను. అయితే యీ ధరల స్థిరీకరణ గురించి బహు జాగ్రత్తగా ప్రభుత్వము ఆలోచించవలసియున్నది. కారణమేమంటే, మన ప్రభుత్వంవారు పన్నుల విధానంకూడా రూపొందించుకోవలసి వచ్చినప్పుడు, మనరాష్ట్రం వ్యవసాయ రాష్ట్రము గనుక ప్రభుత్వమువారు త్వరలో పన్నులు రైతాంగం వద్దనుంచి వసూలుచేయటానికి ప్రయత్నిస్తే, రైతులవద్ద హెచ్చుగా డబ్బువుంటేనేగాని యీ

శిస్తులు వసూలుచేయటానికి వీలుండదు. కనుక తప్పనిసరిగా ప్రభుత్వంవారు యీ ధరల స్థిరీకరణకు త్వరపడవలెనని కోరుతున్నాను. ప్రభుత్వంవారు తగు శ్రద్ధవహించాలని మనవిచేస్తున్నాను. అంతే కాదు పంచవర్ష ప్రణాళికలు దేశములో అమలు జరపవలెనని అంటున్నాము. Local development schemes ద్వారా ప్రభుత్వంవారు తలపెట్టిన community projects ద్వారా national extension schemes ద్వారా మనము ఎన్నోవిధములుగా అభివృద్ధి కార్యక్రమాలను అమలులో పెట్టమంటున్నాము. ఇందుకుగాను రైతాంగము ఏసగమో, శ్రమదానం అయినా లేక డబ్బు అయినా ప్రభుత్వానికి యివ్వడం జరగాలి. ధాన్యపుధరలు పడిపోతే, రైతులు యీడబ్బును ఎక్కడ నుంచి తేగలరు? ఆ దృష్ట్యాచూస్తేగూడా, పంచవర్ష ప్రణాళిక సరిగా, విజయవంతముగా కొనసాగాలంటే తప్పని సరిగా యీ ధరల స్థిరీకరణ చాలా త్వరలో అవసరమని అంటున్నాను. ధరల పెంపుదలగూడ అవసరమనే అంటున్నాను.

అంతేకాకుండా, యీనాడు ప్రభుత్వం కొన్ని లక్షలరూపాయలు ప్రజలకు ఋణాలరూపేణా యివ్వవలసి వస్తున్నది. ప్రజలకు ఈ అప్పును యిచ్చేటప్పుడు సాధారణముగా ప్రజలవద్ద ఏప్రభుత్వంకు అయితే ఋణములు వసూలు చేయగల శక్తి వుంటుందో, ఏప్రభుత్వం అయితే ప్రజలకు ఋణములు యిచ్చే స్థాయిలో వుంటుందో, ఆ ప్రభుత్వమే గొప్పదని అనుకోవాలి. కాబట్టి ప్రభుత్వమే ప్రజలకు ఋణములుయిచ్చే శక్తి గలిగివుండాలంటే, యీ ఋణములుయిచ్చే బాధ్యతనుండి ప్రభుత్వం తప్పించుకోవాలంటే యీ ఋణముల క్రిందయిచ్చే డబ్బును సాంఘిక సంక్షేమ కార్యక్రమాలకు వినియోగించాలంటేగూడా తప్పని సరిగా ప్రభుత్వం యీ ధరల స్థిరీకరణ అవసరమనికూడ చెబుతున్నాను.

ఇంతేకాదు దేశంలో పరిశ్రమలు నెలకొల్పటానికి ప్రభుత్వానికి డబ్బుకావాలి. ఈ డబ్బును ప్రజలవద్దనుంచే ఋణముల రూపేణా సేకరించాలి. ప్రజలవద్ద డబ్బు మిగిలితేనే, ప్రభుత్వమువారు ప్రజలవద్దనుంచి ఋణములు సేకరించటానికి వీలవుతుంది. అందువల్ల ప్రజలవద్ద డబ్బు వుండాలంటే అధిక సంఖ్యాకులలో, అధికభాగముగావున్న యీ రైతాంగమువద్ద డబ్బు నిలువవుండాలి. అట్లాంటప్పుడు ధరల స్థిరీకరణ తప్ప వేరుమార్గము లేదంటున్నాను.

మరొక విషయము చెబుతున్నాను. దేశంలో వ్యవసాయకూలీల వేతనాల స్థిరీకరణను అమలు పరచాలని ప్రభుత్వం భావిస్తున్నది. ఇందుకు నేను ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. కాని, ఆ విధంగా ఆంధ్రరాష్ట్రములోవున్న అన్ని గ్రామాలలోను వ్యవసాయ కూలీల వేతనాల చట్టాన్ని అమలు పరచాలంటే రైతుల ఆర్థికస్థితి బాగుంటేనే తప్ప రైతులు కూలీలకు ప్రభుత్వం నిర్ణయించిన ప్రకారము యివ్వలేని పరిస్థితి ఏర్పడుతుందని హెచ్చరికచేస్తున్నాను. వేతనాలచట్టము అమలులోకి తెచ్చేముందు, రైతుల ఆర్థికస్థితి బాగుపడేటట్లు చేయాల్సివుంది. ప్రభుత్వము యీ బాధ్యతను గుర్తిస్తుందను కుంటాను. ఆదృష్ట్యాగూడా ధరలస్థిరీకరణ అవసరమే. అధికోత్పత్తివల్ల ధరలు తగ్గిపోతూవుంటే అందుకు ప్రభుత్వము యేమిచేయాలన్న విషయాన్నిగురించి ఆలోచించవలసియున్నది. కొన్ని కొన్ని వస్తువులవిషయములో వస్తువులవుత్పత్తి కొరతగా వున్నప్పటికి కూడా ధరలు తగ్గిపోతున్నవి. ఉదహరణకు బెల్లం విషయం తీసుకుందాము. ఈ బెల్లం చిత్తూరుజిల్లాలో బెల్లం ఉత్పత్తి అగుచున్నది.

(Sri P. Rajagopala Naidu) [25th April, 1955

అదేవిధంగా, అనకాపల్లిలో, హిందూపురంలోగూడా బెల్లం ఉత్పత్తి అగుచున్నది. ఈ బెల్లంలో రెండు రకాలువున్నవి. కొన్నిచోట్ల బెల్లం వుండలరూపంలో తయారుచేస్తారు. కొన్నిచోట్ల యీ బెల్లం ఎఱ్ఱగా తయారుచేస్తారు. దీనికి ఎఱ్ఱచక్కెర అంటారు. మనకు చక్కెర చాలా కొరతగా వున్నందున యితర దేశాలనుంచి దిగుమతి చేసుకుంటున్నాము. అందువల్ల ఈ బెల్లమునకు రక్షణ లేకుండాపోతున్నది. ముందు రోజులలో కంట్రోల్సువున్నప్పుడు ఎట్లున్ననూ, యీ రోజులలో కంట్రోలు తీసివేసినప్పుడు బెల్లానికి ధరపడిపోయింది. 5 లక్షల టన్నులు యీ ఎఱ్ఱ చక్కెరను మనము దిగుమతి చేసుకుంటున్నాము. ఆంధ్రరాష్ట్రములో ఉత్పత్తి అగుచున్న యీ ఎఱ్ఱచక్కెరను refineries కు పంపినట్లయితే తప్పని సరిగా వారికి లాభమువుంటుంది. అప్పుడు మనం యీ చక్కెరను విదేశాలనుండి తెప్పించే అవసరముండదు. కాని మన ప్రభుత్వమువారు దేశంలో ఎక్కడెక్కడ ఏ ఏ వస్తువులు ఉత్పత్తి అగుచున్నవి, ఏవస్తువులు వుత్పత్తి ఎంత అదనంగావున్నది, వీటికి మార్కెటు ఎక్కడ, అని ఆలోచిస్తే తప్ప, తప్పని సరిగా యిదిజరిగేదికాదు. మన ప్రభుత్వము యీనాడు కొత్తగా ఏర్పడింది. ప్రభుత్వము యిప్పటికైనా ధరల స్థిరీకరణ విషయంలో తగుశ్రద్ధవహిస్తే మంచిది. ఇంతేకాకుండా మనము యిప్పుడు ఏ ఏ వస్తువులు ఉత్పత్తిచేసుకోగలము, ఉత్పత్తి అయ్యేవస్తువులు అదనంగావున్నవా, కొరతగావున్నవా, అదనంగా వున్నవస్తువులకు ధరల స్థిరీకరణ చేయటానికి ఏమిచేయాలి. కొరతగావున్న వస్తువులకు ధర ఎందుకు పడిపోతున్నది. వాటికి ధరస్థిరీకరణ చేయటానికి ప్రభుత్వం ఏమిచేయాలి అనే విషయాలు పరిశీలనచేయటానికి ఒక కమిటీని వేయమని ప్రభుత్వాన్ని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

Sri K. V. Ramanaiah Naidu:—గౌరవనీయులైన అధ్యక్షా, నేడు గవర్నరుగారి ప్రసంగాన్ని గూర్చి యీసభయొక్క ఆమోదము తెలియజేయటానికి యీచర్చ ప్రారంభమయింది. గవర్నరుగారి పరిపాలన నాలుగునెలలుగా వున్నది. ఈనాలుగు మాసాలలో వీరుచేసిన పరిపాలనావిధానాన్ని గురించిన్నీ, దరిమిలా ఇప్పుడు నూతనముగా ఏర్పడిన మంత్రివర్గంవారు చేయబోయే ప్రభుత్వ విధానాన్ని గురించిన్నీ కొద్దిగా సూచించారు. ఆసూచనలలో మనము ఆమోదించకుండా విమర్శించ వలసినదేమీ నాకు కనిపించడములేదు. అయితే గవర్నరుగారు సూచించిన విషయాలు సమగ్రంగాలేవు. వారుచెప్పిన విషయాలు చాలావరకు క్లుప్తముగావున్నవి. అందువల్ల నేనుకూడా కొన్నిసూచనలు చేయ వలసిన అవసరమున్నదని తలంచుచున్నాను. అందులో ముఖ్యంగా పోర్టువిషయం చెప్పవలసియున్నది. కాకినాడ, బందరు పోర్టులను వృద్ధిచేయటానికి కేంద్రప్రభుత్వంవారి వద్దనుంచి 4 లక్షల 16 వేల రూపాయలు అప్పుతీసుకున్నట్లుగా తెలుస్తున్నది. ఈమధ్య సంజీవరెడ్డిగారు బందరుపోర్టును ఏవిధంగా వృద్ధిచేస్తే బాగుంటుందో ఆలోచించటానికి, అక్కడికివచ్చి తనిఖీచేశారు. ఈసొమ్ము అంతయు బందరుపోర్టుకుమాత్రమే సరిపోతుంది, దానికే ఖర్చుపెట్టుకుంటారని మేమందరము అనుకున్నాము. ఈరెండు పోర్టులున్నూ అభివృద్ధిచేయువలసిన అవసరం చాలా వున్నప్పటికినీ, ముఖ్యంగా రాయలసీమ నుంచి వచ్చే వస్తువులన్నీగూడా యీ బందరు పోర్టుద్వారానే విదేశాలకు ఎగుమతిఅయ్యే కారణముచేత, యీబందరుపోర్టు అవశ్యకత ముందుకువస్తున్నది. రాయలసీమకు బందరుపోర్టు చాలాదగ్గరగావున్న కారణముచేత యీవస్తువులన్నీ యీబందరుపోర్టుకే వస్తవి. బందరుపోర్టుకు ఖర్చుచాలా తక్కువగానే అవుతుంది. అందువల్ల యీబందరుపోర్టును ముందు వృద్ధిచేయవలసి యున్నది.

25th April, 1955] (Sri K. V. Ramanaiah Naidu)

అదివరకే అక్కడ వున్నటువంటి కాలువను లోతుచేయడానికి డ్రెడ్జరుకావాలని అఖండగోదావరి డ్రెడ్జరు తీసుకువెళ్ళే ఏర్పాటుచేస్తామని గత మద్రాసురాష్ట్రంలో లక్ష యాభై వేలు రూపాయలు కేటాయించారు. దానిని అమలు పరచడానికి యింతవరకు ఏవిధంగానూ ప్రయత్నం జరిగివుండలేదు. ఇప్పుడైనను ఆడ్రెడ్జరును తీసుకునివచ్చి అక్కడవున్నటువంటి నీరు పంపుచేసి సముద్రపు బార్డరును త్రవ్వించడానికి, కాలువ లోతుచేయడానికి ప్రయత్నం చేసినట్టయితే రేవు పెద్దదికావడానికి సావకాశం వున్నది. ఇప్పుడు రేవులో లక్షటన్నుల iron వచ్చి నిలువవున్నది. కాలువను త్రవ్వించి లోతును ఎక్కువచేయడానికి ప్రయత్నం చేసినట్లయితే రేవు అభివృద్ధి అవుతుంది. రోజుకు 10 వేలమందికి పనికల్పించే సావకాశం వుంటుంది. కనుక ఈ పనిని తప్పకుండా చేయాలని నాసూచన.

కాంగ్రెస్‌పార్టీ చేసినటువంటి దుష్ప్రచారంవల్ల కమ్యూనిస్టులకు అపజయం కలిగిందని సోదరులు సుందరయ్యగారు చెప్పారు. నా అనుభవాన్నిబట్టి కృష్ణాజిల్లాలో, అందులో ముఖ్యంగా తూర్పు కృష్ణా జిల్లాలో, దుష్ప్రచారం అంతా కమ్యూనిస్టులే చేశారని నిస్సందేహంగా చెప్పగలను. కమ్యూనిస్టులు చేసినటువంటి ప్రచారం దుష్ప్రచారమే కాకుండా, అబద్ధప్రచారం మోసపు ప్రచారం అనడంలో కూడ అతిశయోక్తిలేదు. అంతే కాకుండా అమానుషంగా చోరకృత్యాలు కావించి అక్కడేకాకుండా బందరు టవును గుడివాడ తాలూకాలలో ఏమో కాంగ్రెసువారు దుష్ప్రచారం చేశారని చెప్పడం చాలా శోచనీయంగా వున్నది. ఇప్పటికీ కోర్టులో కేసులు నడుస్తున్నాయి. ఒకసారి రికార్డులుచూస్తే తెలుస్తుంది. దుష్ప్రచారం, అబద్ధప్రచారం కమ్యూనిస్టులు చేశారుగాని కాంగ్రెసువారు చేయలేదు. అయిదెకరాల భూమియిస్తామని 1952 వ సంవత్సరం ఎలక్షనులలోచెప్పి కమ్యూనిస్టులు 40 స్థానాలు సంపాదించారు. మరల అదేమోసం చేయడానికి ప్రయత్నించి పరాజయం పొందారు.

రెండోది గవర్నరు ప్రసంగాన్ని అభినందించే విషయం. నందికొండ ప్రాజెక్టు గడచిన మంత్రివర్గం time లో మొట్టమొదటి పంచవర్ష ప్రణాళికలో చేరకపోయినప్పటికీ, వారి హయాంలో పంచవర్ష ప్రణాళికలో చేర్పించడానికి ప్రయత్నించినందుకు గవర్నరుగారిని ముఖ్యంగా అభినందించవలసియున్నది. ఇప్పుడు 5 ఫ్యాక్టరీలు ఆంధ్రరాష్ట్రంలో ఏర్పాటు చేయడానికి ప్రయత్నం చేస్తున్నాం అన్నారు ఇందులో ముఖ్యమైనది సిమెంటుఫ్యాక్టరీ. నందికొండ ప్రాజెక్టుకు లక్షలాది టన్నుల సిమెంటు కావలసివున్నది. కాబట్టి ప్రయివేటు వ్యక్తులకు లాభంపోకుండా మనరాష్ట్రం ప్రభుత్వం తరఫున నందికొండ ప్రాంతంలో ఒకటి, బెజవాడలో ఒకటి సిమెంటు ఫ్యాక్టరీ కట్టినట్లయితే ఆ లాభం యావత్తు ప్రభుత్వానికి వుంటుంది. సోషలిస్టికి పాటర్ను గురించి నాకు అర్థం అయినంతవరకు, వ్యవసాయికదేశంలో సామ్యవాదసమాజం ఏర్పాటుచేయడం సాధ్యంకాదు. అది పారిశ్రామికంగా అభివృద్ధి అయిన దేశాలలో సాధ్యం అవుతుంది. అందుచేత సిమెంటు ఫ్యాక్టరీలు షుగరు ఫ్యాక్టరీలు మున్నగునవి మన రాష్ట్రప్రభుత్వ తరఫుననే కట్టుకుంటే లాభం అంతా గవర్నమెంటుకే వుంటుంది అని నా మనవి. మనం అందరూ ఆశిస్తున్నటువంటి separation of the executive from the judiciary విధానం చాల జిల్లాలలో అమలువరచారు. కొన్ని జిల్లాలలో ఇంకా జరగలేదు. ఆ జిల్లాలలోకూడ ఈ రెండుశాఖలను విడదీసి వెంటనే అమలులో పెట్టినట్లయితే రాష్ట్రం యావత్తు ఒకేవిధమయినటువంటి న్యాయవిచారణ జరిగే సావకాశం వుంటుంది. కాబట్టి వెంటనే ఆవిధంగా పెట్టవలసినదిగా నా ప్రార్థన. రెండోది కృష్ణాజిల్లాలో యిదివరకు 1941 వ సంవత్సరంనుంచి

(Sri K. V. Ramanaiah Naidu) [25th April, 1955

నేను గవర్నమెంటు ప్లీడర్ అండ్ పబ్లిక్ ప్రాసిక్యూటరుగా వుంటున్నప్పటినుంచీ ఆలోచనలో ఉన్న బుడమేరు ప్రాజెక్టు ఇంతవరకు అమలుజరుగలేదు. ఈ ప్రాజెక్టు విషయంలో ప్లానులు తయారుచేసి భూములకు ఏవిధంగా compensation వుండాలని నాకు పంపించగా నానలహాలుకూడాపంపి ఎంతో కాలమయింది. బుడమేరు వరదలవల్ల పొంగినపుడు కృష్ణాజిల్లావారు దానికి గురి అవుతున్నారు. అదే విధంగా ఉప్పుటేరు వంకర టింకరగా ప్రవహించడంవల్ల వరదలలో హెచ్చుభూములు నీటిముంపుకు గురి కావడం జరుగుతున్నది. శిస్తు రెమిషను ఏటా యివ్వాల్సివస్తుంది. కనుక వెంటనే ఈ స్కీమును అమలుపరిస్తే ప్రజలు సుఖపడడమేకాకుండా ఎంతోపంట మిగులుతుంది. తరువాత కృష్ణాజిల్లాలోని మురుగునీటిని యావత్తు కైకలూరుద్వారా సముద్రంలోనికి పంపవచ్చు.

ప్రస్తుత పరిస్థితులలో డిస్ట్రిక్టుబోర్డ్సు వుండవలసిన అవసరంలేదు. పంచాయతీచట్టాన్ని సవరించడం చాలా అవసరం. గ్రామాల్లోవున్నట్టి పంచాయతీబోర్డు ప్రెసిడెంట్లు చాల అధికారాలను కలిగి వున్నారు. ప్రాసిక్యూటు చేసేవారే తీర్పుచెప్పడం ఎక్కడాలేదు. కాని యిక్కడ జరుగుతున్నది. అందుచేత యీపద్ధతి మార్చాలి. గ్రామాలలోనివారు చదువురానివారు, ప్లీడర్లు గ్రామాలకు వెళ్లరు కనుక పంచాయతీబోర్డు ప్రెసిడెంట్లు వారియిష్టంవచ్చిన తీర్పులు యిస్తున్నారు. కనుక యీఅధికారాలు తీసివేస్తూ పంచాయతీ యాక్టు సవరణ చేయాల్సిన అవసరం వున్నది.

తర్వాత water works and drainage schemes కు మునిసిపాలిటీలకు కోటిరూపాయలు యిచ్చారు. కాశేశ్వరరావు కమిటీ అనేది ఒకటివుంది. అకమిటీ నివేదికప్రకారము ఇంకా అనేక కోట్లు కావలసియున్నది. దానినిబట్టి బందరు మునిసిపాలిటీకి priority ఇచ్చి అస్కీమును ముందుగాతీసుకొనవలెనని కోరుతున్నాను.

*Sri A. Eruku Naidu:—గౌరవనీయులైన అధ్యక్షా, గవర్నర్‌గారు చేసిన ప్రసంగములో ఆంధ్రపరిపాలన విధానము ఇంకా అనేకవిషయాలు పొందుపరచినారు. గాంధిగారు మనకు ఆదేశించిన రామరాజ్యమును అవడి కాంగ్రెస్ తీర్మానము Socialist Pattern of Society యీ 5 సంవత్సరాలు కాలముతో అమలు జరపడము ఔతుందని యీ నివేదికవల్ల తెలియజేశారు. కాని శాసనాలు చేయడమువల్ల ఇది జరుగదు. మన శాసనసభదాటి సభ్యులు బయటికివెళ్లి తమ నియోజక వర్గాలలోని గ్రామస్తులయొక్క కష్టసుఖాలు విన్నట్టయితే చాలవరకు ఇది ఆచరణయోగ్యములో లేనట్టు అనిపిస్తుంటుంది. ప్రతి సంవత్సరము ప్రకటనలు జరుగుతూ వుంటాయి. కాని బాగా చూచినట్టయితే అవి ఎంతవరకు అమలు జరుపబడినాయో విశదమవుతుంది. హరిజనులకు ఉచితముగా ఇండ్లుకట్టుకొనడానికి స్థలాలు యిస్తారని యీనివేదికలోవుంది.

Sri K. Seetharamayya:—on a point of order Sir అధ్యక్షా గౌరవ సభ్యుడు పుస్తకాలు పెట్టుకొని చదువవచ్చునా ?

MR. SPEAKER:—చదువకూడదు కాని కాస్త దానిసహాయముతో ఉపన్యసించవచ్చు.

Sri A. Eruku Naidu:—పాలూరు నియోజకవర్గము దత్తిరాజేరుగ్రామంలో 7 వందల రూపాయలు ప్రభుత్వానికి కట్టినా నేటివరకు స్థలాలు ఇవ్వలేదు. అడబ్బు తిరిగియింతవరకు పాపమైన

యివ్వలేదు. అక్విజిషన్ చట్టము మార్పుచేస్తేనే కాని ప్రజలకు ఇండ్లస్థలాలు లభ్యముకావు. సాలూరు estate లో Rent Reduction Act క్రింద శిస్తు తగ్గింపుమేరకు బి. మెమోల క్రింద సర్వేకాని గ్రామాలలోకూడ హెచ్చుగా వసూలుచేస్తున్నారు. వడ్డీతోసహా శిస్తు వసూలుచేస్తున్నారు. ఈవిషయము ప్రభుత్వానికి అధికారుల దృష్టికి తీసుకువచ్చినా నేటివరకు ఎట్టిచర్య తీసికొనలేదు. శ్రీకాకుళం జిల్లాలో వంశధార ప్రాజెక్టు కట్టడము చాల సంతోషకరమైన విషయము. కాని చెరువుల మరమ్మతు విషయములో ప్రభుత్వము తగినచర్య తీసికోవాలని కోరుతున్నాను. ముఖ్యంగా విద్యలో సాలూరుతాలూకా చాల వెనుకపడింది. సాలూరులో జిల్లాబోర్డు అధ్వర్యాన ఒక high school స్థాపించడమైంది. స్థిరమైనభవనములేక పిల్లలు ఎక్కువగా బాధపడుతున్నారు. ఈ high school భవనమునకు శంకుస్థాపన జరిపినప్పటికి వారికి ఆదాయము లేదని దానిని ఇంకొక స్థానానికి మార్చాలని జిల్లాఅధికారులు అభిప్రాయపడుతున్నారు. దీనిని ఇంకొకచోట పెట్టకుండ ప్రభుత్వమువారు సత్వరచర్య తీసికొంటారని ప్రార్థిస్తున్నాను.

Sri A. Bhagavantha Rao :—అధ్యక్షా, శ్రీ గవర్నరుగారు చేసిన ప్రసంగమునకు వారిని అభినందిస్తూ శ్రీ రాజేశ్వరరావుగారు తెచ్చిన తీర్మానాన్ని బలపరుస్తున్నాను. కాని గవర్నరు గారి ప్రసంగంలోవుండే కొన్ని అంగములను అంగీకరించలేనందువల్ల వాటిని సవరించవలసిందిగా ప్రార్థించవలసివస్తోంది. మనది planned economy. మనం నిర్మించబోయేది socialist pattern of society. గవర్నరుగారి ప్రసంగాన్ని సమగ్రంగా పరిశీలనచేస్తే రాష్ట్రానికి planned economy అనేదికాని, socialist pattern of society కి అనుగుణంగా ఉండాలనేదికాని లేదని నా అభిప్రాయం. ఎందుచేతనంటే, agricultural labour విషయంలోకాని, చిన్న పరిశ్రమల విషయంలోకాని, కల్లుగీత పనివాళ్ల విషయంలో కాని గవర్నరుగారి ప్రసంగం సమగ్రమైన పథకాన్ని సాధించలేకుండా పోతోందని నేను చెప్పదలుచుకున్నాను. నందికొండ, వంశధార ప్రాజెక్టుల విషయంలో సమగ్రమైన సిద్ధాంతాన్ని ఇవ్వలేకపోయింది. వెనుకబడిన జాతుల సముద్ధరణకై గవర్నమెంటు ఏ విధంగా చర్యతీసుకునేది చూపించలేకపోయారు. గీత పనివారల విషయంలోనే గత అసంబ్లీ రద్దయిన సంగతి అందరికి తెలుసును. ఎన్నికలు జరిగిన పిమ్మట గీత పనివారల సమస్యా పరిష్కారానికి ఎటువంటికార్యక్రమాన్ని అమలు జరుపబోయేది గవర్నరుగారి ప్రసంగంలో లేనందుకు విచారించవలసియున్నది. వారిలోవుండే unemployment, under employment గురించి sample survey undertake చేస్తామని అన్నారు. ఈ survey ఎక్కడ చేయించేది స్పష్టంగా గవర్నరుగారి ప్రసంగాలలో చెప్పకపోవడం శోచనీయమైన సంగతి. Toddy juice ను రాష్ట్రమంతటా ఉపయోగించేట్లా measures తీసుకోవడం, దానిద్వారా మాజీ గీతపనివారికి employment కలిగించే విషయం సమగ్రంగాలేదు. ఈ విషయంలో గవర్నమెంటువారు ఒక నిశ్చితాభిప్రాయానికి వచ్చినట్లులేదు. మాజీ గీతకార్మికులకు వృత్తులు కల్పించే విషయంలో immediate action తీసుకొనడానికి పూనుకొన్నాం అని ఒక sentence వున్నది. గవర్నరుగారి ప్రసంగంలో immediate action ఏవిధంగా తీసుకునేది, ఏవిధమైన employment కల్పించడానికి ప్రయత్నించేది సూచించకుండా విడిచిపెట్టడం బాగుండలేదు.

చేనేత పారిశ్రామికుల విషయంలోకూడా వారికి జీవనోపాధి కల్పించుటకు కావలసిన చర్యలు ఏమి తీసుకునేది తెలియడంలేదు. ఈ విషయాలన్నింటిలోను సమగ్రమైన పథకాలు రూపొందించి వచ్చే బడ్జెటు సమావేశంలో సభవారి ఎదుట పెడతారని ఆశిస్తున్నాను. Socialist pattern of society కి అనుగుణంగా 60% మంది వెనుకబడినవారిని అభివృద్ధిచేసే ప్రణాళిక, వ్యవసాయ కూలీలకు, ex-tappers కు వృత్తి కల్పించే ప్రణాళిక తయారుచేస్తారని ఆశిస్తున్నాను. Planned economy విషయంలో, National extension blocks గురించి ప్రస్తావన జరిగింది. ఇంతవరకు ఇవి ఏవిధంగా పనిచేస్తున్నవి సమగ్రంగా లేకపోవడం బాగుగాలేదు. రేపల్లె తాలూకాకు సంబంధించినంతవరకు, సముద్రతీరప్రాంతం అంతా చాలా backward area గా వున్నది. ఆ ప్రాంతాన్ని community project area క్రింద తీసుకుంటే దాన్ని చాలా అభివృద్ధిలోనికి తీసుకురావచ్చును. ఈ area ను community project area క్రింద చేస్తారని ఆశిస్తున్నాను. మిగతా విషయాలు మిత్రులందరు మాట్లాడారు. నేను చెప్పిన విషయాలు బడ్జెటు ప్రతిపాదించే సందర్భంలో గుర్తిస్తారని ఆశిస్తూ, గవర్నరుగారి ప్రసంగానికి వారిని అభినందిస్తూ సెలవుతీసు కుంటున్నాను.

*Janab Sheik Mahammad Rahamathullah:—అధ్యక్షా, గవర్నరుగారి ఉపన్యాసాన్ని అభినందిస్తూ గౌరవసభ్యులు రాజేశ్వరరావుగారి తీర్మానాన్ని బలపరుస్తూ కొన్ని ముఖ్యవిషయాలు ప్రభుత్వ దృష్టికి తెచ్చుచున్నాను. గవర్నరుగారి ప్రసంగంలో అయిదు ఫాక్టరీలుమాత్రం పెట్టుచున్నట్లు చెప్పినారు. అవి ఏస్థలాల్లో అయినది తెలియకుండా వున్నది. వీటిలో సిమెంటు, ఎరువులు, వస్త్రాలమిల్లులు వున్నాయి. సిమెంటుమిల్లు స్థాపించడానికి కడపలో మంచి వసతియున్నది. Limestone సిమెంటు ఫాక్టరీకి చాలా ముఖ్యఅవసరం. ఇది ఏ కోటి టన్నులో ఏ ఖర్చులేకుండా ప్రభుత్వానికి దొరుకుతుందనడంలో సందేహంలేదు. ప్రభుత్వంవారు స్వంతంగా factory పెడితే చాలా లాభకరమని నేను తెలియచేయుచున్నాను. Factory కాబట్టి చాలామంది కూలివాళ్లకు కూడా పని దొరుకుతుంది. అక్కడ ఏ irrigation scheme లేదు కాబట్టి ఈ factory పెడితే ప్రజలకు మేలు జరుగుతుందని మనవిచేస్తున్నాను. వేంపల్లిదగ్గర ఫాక్టరీ నిర్మించే విషయంలో రాయలసీమ డెవలప్‌మెంటు బోర్డువారు ఒక నిర్ణయం తీసుకున్నారు కాని అంతకుమించి ఏచర్య తీసుకోబడలేదు.

మైనరు ఇర్రిగేషన్ పనులకుగాను 10 కోట్లురూపాయలు ఇవ్వవలసిందిగా కేంద్రప్రభుత్వమును కోరినట్లు చెప్పబడింది. మైనరు ఇర్రిగేషన్ పనులుఅంటే, సాధారణంగా 250 ఎకరాలకు లోపుగా ఉండే భూములకు నీటిసౌకర్యం కలిగించే పనులకే మైనరు ఇర్రిగేషన్ స్కీములని చెప్పుతున్నాను. ఈ పనులకుగాను ఒక ఓవర్సీరు, తాశీల్దారు, ఒక జిల్లాఅంతటికి ఒక సూపర్‌వైసర్ ఉంటారు. రివిన్యూ డిపార్టుమెంటువారు ఈ పనులను సరిగా చూసుకోవాలెనంటె కష్టంగాయుంటుంది. వారికి ఇంకా ఏవేవో పనులుంటాయి. దీనికి చక్‌మెషర్‌మెంటు మొదలగునదంతా చేయవలసియుంటుంది. కనుక ఈ పనులను P.W.D. లో కలిపివేసినట్లయితే బాగుంటుంది. ఆ డిపార్టుమెంటులో తాలూకాకొక సెక్షన్ ఆఫీసరు, ఒక ఓవర్సీరు ఉంటారు. వారు ఈ పనులను శ్రద్ధగా చూచుకోగలరు. కనుక ఇవి P.W.D. వారికి అప్పగించవలసిందని కోరుతున్నాను. అప్పుడే పనులు చురుకుగా జరుగగలవని నమ్ముచున్నాను.

తరువాత ఈ మునిసిపాలిటీలలో డ్రెయినేజ్ స్కీమ్సుకుగాను ఒకకోటి రూపాయలు కేంద్ర ప్రభుత్వము మనకు కేటాయించినట్లు చెప్పతున్నారు. కడప డ్రెయినేజ్ స్కీము విషయంలో దీని investigation కు గాను 1947 వ సంవత్సరంలో 3,400-0-0 రూపాయలుకూడ కట్టి ఉన్నాము. కాని ఇంతవరకు ఆ స్కీము అమలులోనికి రాలేదు. దయయుంచి ఈ కడప డ్రెయినేజ్ స్కీమును తక్షణం తీసుకోవలెనని కోరుచున్నాను. కడపపట్టణం ఎప్పుడూ మలేరియాతో బాధపడుతూ యుంటుందని అందరికి తెలిసినవిషయమే. Composite State లో ఉండినప్పుడు దీనికి నాలుగవస్థానం ఇచ్చినారు. కనుక ఈ పట్టణం డ్రెయినేజ్‌పని వెంటనే ప్రారంభించే ఏర్పాట్లు చేయవలెనని ప్రార్థిస్తున్నాను. ఇప్పుడు గవర్నమెంటు water works కుగాను మునిసిపాలిటీలకు 11¼ లక్షలు అప్పు ఇవ్వవలెనని నిర్ణయించినట్లు తెలుస్తున్నది. అందుకు గవర్నమెంటువారిని అభినందిస్తున్నాను.

ఈ అవకాశ మిచ్చినందుకు స్పీకరుగారికికూడ నా అభివందనములు అర్పిస్తూ విరమిస్తున్నాను.

Sri Mahaboob Ali Khan:—

میں پہلے یہ کہتا ہوں کہ گورنر صاحب ایوان کو خطاب کرتے سپاس دے - میں آپکا شکریہ ادا کرتے ہوئے یہ کہونگا کہ تم کانگرس اتنی اکثریت حاصل کرنے کے چند وجوہات ہیں - جن میں سابق حکومت نے رعایا کے سہولتیں کا خیال کرتے ہوے سہولتیں پورے کرنے کی وجہ دوسرا مینارٹی کے مرد لوگ کے سیوا وہ خواتیں جو کبھی باہر قدم نہ ڈالیں تھیں - وہ بھی اپنے ساتھیوں کو لیکر اسکو کامیاب بنانے میں حصہ لئے - یہ وجہ سے میں یہ دیکھ رہا ہوں :-

Sri Raja V. V. Krishnam Raju Bahadur:—అధ్యక్ష, గౌరవసభ్యుడు ఉర్దులో మాట్లాడుతున్నారు. అది చాలామందికి అర్థంకాదు. కనుక తెలుగులో మాట్లాడవలసిందిగా కోరితే బాగుంటుంది లేకపోతే, దాని translation కైనా ఏర్పాటుచేస్తే బాగుంటుందని మనవి చేస్తున్నాను.

MR. SPEAKER:—గౌరవసభ్యునికి తెలుగురాదు. కనుక ఉర్దూలో మాట్లాడవచ్చు. Translation కు తగిన ఏర్పాట్లు ఇవ్వడులేవు.

Sri Mahaboob Ali Khan :—

کہ دوسرے محکمہ تعلیمات کے محکومہ کے اساتیذہ کو تنخواہ بالکل کم ہے
چونکہ یہ ایک محکومہ ہے جو علم ادب کا محکومہ ہے۔ مگر اسی کو کم ۔ اس سے
گذارش ہے کہ حکومت اس پر غور فرماکر ان کی ضرورتیں پوری کریں ۔ یہ
آندھرا ہی نہیں بلکہ پورے ہندوستان میں مینارٹی قوم بھی بس رہی ہے۔
ہر کاروبار میں دونوں کا ایک ساتھ کام چل رہا ہے۔ انکے بھی آبا واجدا
کے ہڈیاں یہاں دفن ہیں۔ مگر افسوس یہ ہے کہ انکے بچے اپنی مادری
زبان سے علم سیکھتے ہوے آرہے ہیں۔ سنا گیا ہے کہ بعض اسکول میں
اردو منشی استادونکو نکالدیا جارہا ہے۔ میرا معروضہ ہے کہ جب مسلم
بچے اسکول میں رہیں تو ایک اردو منشی رکھنا چاہئے۔ پرکاشم حکومت نے
۱۰ روپئے مالگذاری معاف کردی تھی۔ موجودہ حکومت اس کو برقرار
رکھیگی۔ کرنول میں کیاپٹل ( Capital ) ہے۔ کرنول گویا جزیرہ
ہے۔ چاروں طرف پانی ہے مگر پانی کی تکلیف ہے۔ اس لئے حکومت پانی
کی سہولت جلد از جلد کرینگے۔ دوسرا یہ کہ غلاظت کا خیال کرتے ہوے
جلد از جلد ڈرینیج ( Drainage ) کا کام شروع کرینگے ۔

MR. SPEAKER :—The Assembly will now adjourn and meet again at 11 a.m. to-morrow.

The House then adjourned.